# శ్రద్ధాంజలి



తాను కాలిపోతూ ప్రపంచానికి వెలుగునందించే క్రొవ్వొత్తిలా సాహితీ రంగానికి అహర్నిశలు అవిరామకృషిచేసి ఫిబ్రవరి ఒకటవతేదీన జ్యోతికి, జ్యోతి పాఠక లోకానికి శాశ్వతంగా దూరమైన కీ॥ శే॥ వి. వి. (జ్యోతి) రాఘవయ్యగారికి నిష్కల్మషమైన హృదయంతో వారి ఆత్మకు శాంతి కలగాలని కోరుతూ, భక్తిపూర్వకంగా శ్రద్ధాంజలి సమర్పిస్తున్నాము.

ప్రొప్రయిటర్



సచిత్ర మాసపత్రిక


26, బర్కెట్ రోడ్,
టి. నగర్, మద్రాసు-17.

విడి ప్రతి వెల
1 రూపాయి

ఏడాది చందా
పన్నెండు రూపాయలు

సంపుటి 9
ఫిబ్రవరి 1971
సంచిక 2

మేనేజింగ్ ఎడిటర్:
వి. వి. రాఘవయ్య

Edited and Published by V. V. Raghavaiah and Printed by K. Damodaram at Sri Kala Printers, 83, Lake view Road, Madras-33




ముఖచిత్రం
ఉత్తమచిత్రావారి
'మనసూ-మాంగల్యం'




జ్యోతి మేనేజింగ్ ఎడిటర్ గారైన శ్రీ. వి. వి. రాఘవయ్యగారు ఫిబ్రవరి 1 న దిగవంతులయినారన్న వార్త విని చాలా విచారించాను. ఆయన తెలుగు సాహిత్యమునకు చేసిన, సేవ, రచయి (త్రి) తలకు యిచ్చిన ప్రోత్సాహము మరువరానిది వారి కుటుంబమునకు పత్రికా ముఖముగ నా సంతాపము తెలియజేయు చున్నాను. ఆయన ఆత్మకి శాంతిచేకూర్చమని ఆ పరమాత్మని ప్రార్థిస్తున్నాను. ఆయన ఆశయములతో ముమ్ముందు "జ్యోతి"ని నడిపించ వలసినదిగా నా కోరిక.

జ్యోతి పత్రికాభిమాని
పసుమర్తి విష్ణుశర్మ

శ్రీమతి లీలావతిగారికి!

నమస్కారం.

రాఘవయ్యగారు స్వర్గస్థులయ్యారన్న విషాదవార్త విని చాలా విచారించాను. ఎలాంటి కన్‌డోలెన్స్ సెస్ కూడా మీకు కలిగిన లోటును భర్తీ చేయవు.

నేను రాఘవయ్యగారిని త్రు అండ్ త్రు ఎరుగుదును. సృష్టిలో తీయనిది స్నేహమే - అన్న కవి వాక్యానికి ప్రతీక అతను. అతనికి అదృష్ట్యా మరణం లేదు.

జ్యోతి మంత్లీ, తెలుగు పాఠకులకి ఇచ్చిన విజ్ఞాన వినోదాలు సామాన్యమైనవి కావు. తెలుగు పత్రికలు చదివే ప్రతి వ్యక్తికి రాఘవయ్యగారి అస్తమయం వార్త కాకపోవచ్చు. కాని జ్యోతి ఆగిపోతే మాత్రం అది చాలా విషాదవార్త అవుతుంది. జ్యోతిని చూసి మేమూ వెలుగుతాం అని వొచ్చినదీపాలు మధ్యలోనే ఆరిపోవడం అందరికీ తెలుసు.

ప్రత్యేకంగా జ్యోతి మంత్లీ. రచయితగా నన్ను పునర్జ్వలింప జేసిన విషయం కూడా నే నెన్నటికీ మరువలేను!

చిన్న చిన్న రాళ్లు తగిలి జ్యోతి. కాలికి అప్పుడప్పుడు అంతకన్నా చిన్న చిన్న

దెబ్బలు కొన్ని తగిలినా, ఆగిపోకుండా రావడంవల్ల ఆరిపోకుండా వెలగడం జ్యోతికి సాధ్యమైంది. అందుచేత-ఎన్ని కష్టాలు పడి అయినా జ్యోతి ఆరిపోకుండా వెలిగేటట్లు చూడమని పాఠకుల తరపున మీకు నా ప్రార్థన.

భవదీయుడు.
భమిడిపాటి రామగోపాలం.

ఎడిటర్ గారికి!

అయ్యా!

మీ జ్యోతి సచిత్ర మాసపత్రిక చదువుతున్న వేలాదిమంది పాఠకులలో నేనొకదాన్ని. అందులోని కథలూ, నవలలూ, సీరియల్స్. సినిమారంగ అంతా నాకు చాలా నచ్చిందనటంలో అతిశయోక్తిలేదు కాని మీరు గత 5, 6 మాసాలుగా ప్రచురిస్తున్న పదబంధ ప్రహేళిక చాలా కఠినంగా ఉంటున్నది, శ్రీ శ్రీ గారు తమకున్న ఉభయ భాషా (తెలుగుసంస్కృతం) ప్రావీణ్యాన్నంతా అందులోనే చూపిస్తున్నారు. దీనివల్ల పాఠకులకు ఆ పజిల్ మీద ఉండే ఉత్సాహం అంతా నశించిపోతోంది. పోనీ దానికి ఏమైనా బహుమతి లాంటి దేదైనా ఉంటే ఎంత కష్టపడైనా ఎన్ని నిఘంటువులున్నా చూసైనా పూర్తి చేసి పంపిస్తాము. ఏమీలేనిదానికి ఎందుకింత ఆర్భాటం చేస్తున్నారో తెలీదు. పాఠకుల ఉత్సాహమంతా చంపేస్తున్నారు. జ్యోతి చదువుతున్న ప్రతి పాఠకుడు అయనంత తెలివైనవాడు కాదుగదా? సామాన్య ప్రజలందరి వినోదం కోసం స్థాపించిన ఈ పత్రికలో ఉత్సాహకరమైన పజిల్స్ ఉంటే బాగుంటుంది. కాని శ్రీ శ్రీ గారు కేవలం పాఠకులను ఓడించాలనేపట్టుదలతో ఎక్కడెక్కడి మాటలు, (విజ్ఞాన శాస్త్ర సంబంధమైనవి కూడా) పెట్టిఎంతో కఠినంగా కూరుస్తున్నారు. అది ఏమంత బాగుండలేదు. కేవలం పాఠకులు తమ పేరు పత్రికలోకి వస్తే చూసి ఆనందపడతారు. బహుమతి కూడా లేదు. ఇంత సామాన్యప్రజలు చదివే పత్రికలో అంత గొప్పవాళ్ళచేత అంత కఠినమైన పజిల్స్ కూర్పించడం అనవసరమని నా ఉద్దేశ్యం ఈ ఉత్తరంలో ఏమైనా తప్పు లుంటే మన్నించవలెను. ఇంకా కథలు పంపాలంటే ఇదే ఎడ్రస్‌కు పంపవలెనా?

ఆట్లు
ఒక పాఠకురాలు,
వి. లక్ష్మి.



# సజ్జనులందరూ స్వర్గంలోనే ఉంటారు

సజ్జనులందరూ స్వర్గంలోనే ఉంటారని ప్రతీతి. బహుశా ఆ కారణంగానే జ్యోతి సంపాదకులు శ్రీ వి. వి. రాఘవయ్యగారికి పక్వదశ రాకపూర్వమే స్వర్గానికి రమ్మని ఆహ్వానం అంది ఉండాలి. ఆయన దాన్ని మన్నించారు.

ఆధునిక తెలుగు సాహిత్యానికి అమూల్యమైన సేవా తత్పరతలో ఆయన వెన్ను చూపలేదు. జ్యోతి మాసపత్రికను బహుజనరంజకంగా నడిపేందుకు శక్తివంచనలేకుండ పాటుపడ్డారు. ఆరోగ్యం చెడిన కారణంగా పత్రిక కుంటి నడక పడింది. ఐనప్పటికీ ఆయన పత్రికను ముద్దుబిడ్డవలెనే పెంచారు.

ఏమైతేనేమి—కాలగర్భంలో కలిసిపోక తప్పదుకదా! శ్రీ రాఘవయ్య ధన్యజీవి. స్నేహపాత్రుడు. ఆయన సౌహార్దాన్ని కోల్పోవటం మన దురదృష్టం.

వారి ఆత్మకు శాంతి చేకూరుగాక !

వారి కుటుంబానికి నా సానుభూతి.

ధనికొండ హనుమంతరావు

# మంచి మిత్రులు మా రాఘవయ్యగారు!

రాఘవయ్యగారు తొలి సారిగా జ్యోతి మాస పత్రిక విజయవాడలో ప్రారంభించిన నాడు ఆ సమావేశంలో పాల్గొన్నాను. అంతకుముందే రాఘవయ్యగారిని ఆంధ్రజ్యోతి ఆఫీసులో చూచివున్నాను. ఎప్పుడూ ఉత్సాహంగా మిత్రులతో గోష్ఠి జరపడం రాఘవయ్యగారికి ఎంతో సరదా. ఆ తర్వాత అడపా దడపా విజయవాడ వెళ్ళినప్పుడల్లా రాఘవయ్యగారిని కలుసుకుంటుండేవాణ్ణి.

జ్యోతి మద్రాసుకు మారిందంటే రాఘవయ్యగారిని చూడాలని వెళ్ళాను. జబ్బుపడి కాస్త కోలుకుని నీరసంగా వున్నారు. అయినా ఆయనలో ఉత్సాహం అణుమాత్రం తగ్గలేదు. ఎంతో సరదాగా కబుర్లు చెప్పారు.

అంతలో మళ్ళీ జబ్బు చేసిందనీ, రాఘవయ్యగారు అకాల మృత్యువువాత పడ్డారనీ తెలిసి చాలా విచారించాను.

మంచి మిత్రుణ్ణి కోల్పోయాను. వారి ఆత్మకు శాంతి కలుగుగాక.

దాశరధి.

# జ్యోతి సక్రమంగా నడపటమే
# రాఘవయ్యగారి ఆత్మకు శాంతి!

శ్రీమతి లీలావతమ్మగారికి!

నమస్తే! మీకు నా సానుభూతి ఎలా తెలియచేయాలో మాటలు కూడా రావడంలేదు. ఈ వార్త వినగానే మనసు దిమ్మెరబోయినట్టుంది!

మీరు దుఃఖాన్ని పక్కన పెట్టి, పిల్లలకోసం. మా కోసం, పాఠకులకోసం జ్యోతి నిర్వహణభారాన్ని పూర్తిగా తీసుకోగలరని నమ్ముతున్నాను. జ్యోతిద్వారా చాలామంది కొత్త రైటర్స్ పైకి వచ్చారు. అందులో నేను ప్రప్రథమురాలిని అన్న విషయం నేనెప్పుడూ మర్చిపోను.

రచనల విషయంలో కాని, మిగతావి మానుంచి అయే సహకార విషయంలో మా శక్తిమేరా మీకు చేయూత యివ్వగలం.

జ్యోతి సక్రమంగా నడవటమే రాఘవయ్యగారి ఆత్మకు శాంతి గలుగునని భావిస్తాను.

నమస్కృతులతో,

సులోచనారాణి.

# కీర్తిశేషులైన జ్యోతి రాఘవయ్యగారి
## జీవిత సంగ్రహం

శ్రీ రాఘవయ్యగారు కృష్ణాజిల్లా కలవపాముల గ్రామంలో శ్రీ వెల్లంకి వెంకటపతి, శ్రీమతి వెంకట సుబ్బమ్మగార్లకు ద్వితీయ పుత్రునిగా 30-8-1920 తేదీన జన్మించారు. ఆయన బాల్య జీవితము కలవపాములలో గడిపారు. విద్యార్థి జీవితం తాడంకి, జగ్గయ్యపేట, బందరు, విజయవాడలలో గడిపారు. బి.కాం. పట్టా పుచ్చుకున్నారు. బాల్య జీవితమునుంచి తుదివరకు తాను తలచినదే అమలు జరిపే స్వభావం తొలి పరిచయంలోనే ఎదుటి వ్యక్తిని ఆకర్షించే శక్తి సామర్థ్యాలు, ఆకర్షణగల స్వభావముగలవారు. విద్యార్థి దశనుంచే ఆయన సాహిత్యాభిమాని, కళాపిపాసి, అభ్యుదయ భావాలతో మెలిగారు. విద్యార్థిగా వుండి విద్యార్థిసంఘాలలో కృషిచేస్తూ విద్యార్థులకు తలమానికంగా వుండేవారు.

శ్రీ రాఘవయ్య కొంతకాలం ఆంధ్రా సిమెంట్ కంపెనీలో పని చేస్తూ, మద్రాసులో సినిమారంగానికి సంబంధించిన ప్రసాద్ పబ్లిసిటీస్ సంస్థను నెలకొల్పి కొంతకాలం దానిని నిర్వహించారు. శాంతిసిరి పబ్లికేషన్స్ సంస్థను స్థాపించి. కొన్ని డిటెక్టివ్‌నవలలను ప్రచురించారు. విజయవాడలో ఆంధ్రజ్యోతి దినపత్రిక మేనేజర్‌గా కొంతకాలం పనిచేశారు. అక్కడ పనిచేస్తూనే జ్యోతి మాసపత్రిక ప్రారంభించారు. కొద్దికాలంలోనే జ్యోతి తెలుగుమాసపత్రికలలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకొనేట్లు అహర్నిశలు పాటుపడ్డారు. జ్యోతితోపాటు 'పత్తేదారు' డిటెక్టివ్ మాసపత్రిక, జ్యోతివారపత్రికలను కూడా నడిపారు. ఇవిగాక విజయవాడ ప్రెస్‌క్లబ్ చైర్మన్‌గా కార్యభారాన్ని వహించారు, 'ది పీరియాడికల్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా' అనే పత్రికా సంస్థకు ఎగ్జిక్యూటివ్ మెంబరయ్యారు.

ఒక్క మాటలో చెప్పాలంటే సాహితీ ప్రపంచంలో జ్యోతి రాఘవయ్య అంటే తెలియనివారు లేరు. ఆయన జీవితము సాహిత్యవేత్తగానూ, కళాపిపాసిగానూ, అభ్యుదయవాదిగానూ ప్రజలమధ్య మెదిలింది! ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి, తన జీవితమును వాటికే అంకితమిచ్చిన మహా మనీషి!

# నవచైతన్యం

—జె. ఎల్. నారాయణ, డి. వి. కోటేష్

పరుగెడుతున్నాడు ప్రగతివైపు మానవుడు
మంచిదే అతడు కానంతవరకు దానవుడు
అందరాని చందమామ అంతుచూచాడుకాని
అంతు తెలియని అజ్ఞానంలో కొట్టుకులాడు
తున్నాడు.

పుట్టింది లోకానికి జాడ్యం
ఎక్కడ చూచినా స్వార్థం
మహామహుల త్యాగం
అంతా అయింది వ్యర్థం
నృత్యం చేస్తున్నదింకా దేశంలో
కట్నపిశాచి విలయతాండవంతో
మనిషిని కబళించి వేస్తున్నయ్
బూజు పట్టిన పాత సిద్ధాంతాలు
రోజు రోజుకూ పెరుగుతోంది వయసు
కాని తగ్గుతున్నది మానవుని మనసు
మలమల మాడుతున్నాడు
సామాన్యుడు మతిలేని
అధికారుల మితిలేని
స్వార్థాగ్నికి -
ఎంత కాలం? ఇంకెంత కాలం??
పేదలు కంటున్న కలలు
అవాలి ఉత్త కల్లలు
కలిగింది ప్రజలలో
నవచైతన్యం
లేక ప్రజాద్రోహుల కోపం
అవుతుందదే వారి శాపం
గాంధీజీ కన్న కల
అయింది సంద్రపు అల
పడబోతున్నది దేశంమీద
వినబడలేదా దివ్య చైతన్య స్రవంతి!
రాబోతున్నది రామరాజ్యం
ఎందుకు సందేహం
కాదిది ఆవేశం
పిలుస్తున్నది దేశం
పదండి పోదాం! పదండి ముందుకు!

# చదువుకోనీయరు (నాటిక)

## అన్నాబత్తుల నరసింగరావు

(హాస్టల్ లోని గది. సమయం సుమారు రాత్రి 7 గం॥ శేఖర్ మెస్ నుంచి భోజనం చేసి, గదిలో ప్రవేశిస్తాడు.)

శేఖర్ : వెధవది! రేపే తగల పడాలా! ఈ క్లాసు పరీక్షలొకటి మధ్యలో

(విసుగ్గా పుస్తకం తెరుస్తాడు)

(పొడుగు చెంపలు, పుల్‌హాండ్స్ షర్ట్, టైట్ పేంట్ తో ప్రసాద్ ప్రవేశం) ప్రసాద్ : వాట్ మేన్! ఏంటి తిద్దుతున్నావ్! మరీ జిడ్డయిపోతు న్నావే!

శే : ఒరే నాయనా! నాకసలే ఈ ఏడు చుక్కెదురుగా ఉంది. అందులోను ఈ వాళ

ప్రొఫేసర్ పిల్చి గూటాయించాడు, నా కాండక్టు అదీ బాగులేదని.

ప్ర : ఏడిశాడులే! మనమేం అల్లుళ్ళయి నట్లు మధ్యన పీక్కపోరొకటి. ఒక సైక్లిక్.నోటీస్ పారెస్తే సరి. తుక్కిన పేనుల్లా కాళ్ళ బేరానికొస్తారు, చదివి ఈ రోజుల్లో ఏం సాధిస్తారోయ్! పుష్ వుండాలి పుష్,

శే : ఒరే! నన్ను డిస్టర్బ్ చేయకు. అయినా ఎక్కడికీ ఉడాయింపు.

(కొంచెం సేపు తటపటాయించి)

ఒక మాట అంటాను ఏమీఅనుకోవు కదూ!

ప్ర : నా సైడ్‌లాక్స్ అసహ్యంగా ఉన్నా యంటావు అంతేనా! నేనెక్కడికెళ్ళినా ఇదేమాట! ఎవరేమనుకుంటే నాకేం! ఇది ఇప్పటి పేషన్! దీన్ని మార్చడం అసాధ్యం.

శే : చూడు ప్రసాద్ ఎవడో క్షవరం చేయించుకోడానికి తీరిక లేక కొంచెం చెంపలుపెంచాడనుకో! అదే పాషన్ అనుకొని నీలాంటి వాళ్లు కూడా

పెంచడం ఏం బాగులేదోయ్! చేసిన పని నలుగుర్లో చెప్పుకోడానికి సమం జసంగా ఉండాలి.

ప్ర : అఖిల భారత మంగళ్ళ మహా సభాధ్యక్షుడిలా మాట్లాడుతున్నా వేమిటి? మావల్లమీ బిజినెస్‌కి దెబ్బ తగలదులే! ఎటొచ్చీ కొంచెం జాగ్రత్తగా కత్తిరిం చాలి.

అ ఊ పెందుకు గాని, బార్‌కి వస్తావా?

శే: ఎంతమాట! బార్‌కా! మా నాన్న పెద్ద గాంధీ వాది. నా కిలాంటి విషయా లంటేఅసహ్యం. సిగరెట్లు కాల్చడానికే నా అంతరాత్మ ఒప్పదు. ఈ హాస్టల్

దయవల్ల అలవాటయింది.

ప్ర: ఏమి క్రొత్తగా కొత్త కాంగ్రెస్‌లో చేరినట్లు గాంధీ, అంతరాత్మ అంటు న్నావ్?

మన మిషుదెంజాయ్ చేయకపోతే ఎప్పుడు చేస్తామోయ్?

ఏమంటావ్?

శే: ఏమంటాను? ఇప్పటికి నాకు పడింది చాలు. వెధవది ఒక్క వాక్యం కూడా చదువ నివ్వరు సినిమా హాలుల్లో నయినా చదువుకోవచ్చు గానిఈ హాస్టల్లో

మాత్రాం చదువుకోలేం.

ప్ర: ఆల్‌రైట్ బ్రదర్! కారీ ఆన్! ఎవరి కర్మ వాళ్ళది.

(విసురుగా వెళ్ళిపోతాడు)

(శేఖర్ చదవడానికి ప్రయత్నిస్తాడు)

("సార్" అని మెస్ బోయ్ పిలుచు కుంటూ ప్రవేశం)

శే: ఏంరా! నీకేం పనీ పాట లేదేంటి ఇప్పుడొచ్చావ్!

బో: అది కాదండి. పాయంత్రం చాక లొచ్చాడు. మీరు బట్టలేస్తామన్నారట కానిమీరు లేకపోవడంతో వెళ్ళిపోయాడు.

శే: పోతే పోయాడు. మళ్లీ వస్తాడులే; మధ్యన నీ రాయభార మేమిటి?

బో: మీ....మీరు దసరా ఇనాం ఇస్తాన న్నారు, కదండి....

శే: అలా అడగ కూడదు. కథలన్నీ చెప్తావేమిటి? రేపు కనిపించు పో!

("మెస్ బోయ్ నిష్క్రమణం. శేఖర్ మరల చదవడానికి ప్రయత్నం.)

("ఏంది కథ గురువుగారు?" అను కుంటూ రాజారావు ప్రవేశం.)

శే: రాజారావుగారు! నా పూర్వ జన్మ సుకృతం. తల్లి ఈ వాళపుస్తకం ముట్టానలోకం అంతావిరుచుకు పడుతున్న ట్టుందే నా మీద.

రా: ఏదో కథలో చదివి నట్టుందే మీ డైలాగు. అయినా బాగుందిలెండి. నాకు ఇవాళ. ఒక గొప్ప ఐడియా పట్టింది. కథ వ్రాసి పారేద్దామనుకుంటున్నాను.

శే: పోయి రాసుకుందురూ!

రా: చూడండి అంతలోనే నన్నపార్థం చేసుకున్నారు. అసలు నేను వివిధ పరిస్థితుల్లో

విభిన్న దృక్పధాలున్న మానవులెలా ప్రవర్తిస్తారా? అని కుతూహలంతో

అందరి దగ్గరకు వెళ్ళి కదుపుతుంటాను. మన సుబ్బరాజు స్కాండ్రల్ మీద ఒక నవల వ్రాయా లనుకుంటున్నాను.

శే: ఏ సుబ్బరాజండీ!

రా: అదే సుబ్బరాజు-సుజాత వ్యవహారం

శే: ఆ! ఆ!

రా: అదే లేండి నవల వ్రాద్దామనుకుం టున్నా అప్పయే సరికి ఆలస్యమవుతుం దేమోనని ముందు టూకీగా ఒక కథ వ్రాయలనుకుంటున్నాను.

శే: ఐ పి (మధ్య మధ్యన పుస్తకంలోకి చూస్తూంటాడు)

రా: అయినా మన ఆంధ్ర ప్రజల్లో సాహిత్యం అంటే గౌరవం అసలు లేదండి!

నా కథ సుమారు 12 అరటావులొచ్చింది. పెయిర్ కూడా చేసేశాను.

శే: చూడండి! ఆ కథ గురించి వర్ణన కన్న ఆ పటానా మొహాన పారెయ్య కూడదూ.

రా: చిరాకు పడకండీ గురువుగారు! లక్ష్మి సరస్వతులొక దాగ్గిరుండ వంటారే! అదంత నిజమో అనుభవం మీద తెలుస్తుంది.

శే: అంటే లక్ష్మి మీ దగ్గర చేరడానికి మొగమాట పడుతుందన్న మాట.

రా: లక్షీ! అంత పెద్ద పదం వాడక్కర్లేదు లేండి. ఒక్క రూపాయతోనే సరస్వతికి సంతృప్తి కలుగుతుంది. అనట్టు ఈ వెధవ కథలున్నాయి చూశారూ! వ్రాయగానే పోస్టుడొక్కులో వేయకపోతే బద్ధకం, అనుమానం పీక్కుతింటోంది..

శే: నా కివ్వండి చదివేసి పోస్టు చేస్తాను.

రా: మీ కెందుకు లెండి ఆ శ్రమ! ఒక్క రూపాయి సర్దుదురూ నెక్స్ట్ ఎం.ఓ.లో సరిపెట్టేస్తాను (శేఖర్ ఒక రూపాయి రాజారావుకి ఇస్తాడు)

ఈ మధ్యన కవితలు కూడా ట్రై చేస్తున్నాను. వినిపించమంటారా?

శే: అబ్బే: రేపు వింటానులే

(రాజారావు నిష్క్రమణం. శేఖర్ సిగరెట్టు ముట్టించి పొగవదుల్తాడు. అంతలో ఎదురుగా పంచ, లాల్చి ధరించిన సుబ్బరామయ్య ప్రవేశం)

సు: ఏమబ్బాయ్ నేనొచ్చినప్పుడు నువ్వు సిగరెట్ కాలుస్తున్నావ్? మీ నాన్న వచ్చినప్పుడు మా వెధవ కాలు స్తాడు మర్యాద మంచి తెలియక్కరలేదు. బొత్తిగాపాడయి పోతున్నారు.

(శేఖర్ గాభరాగా సిగరెట్ పక్కనపడేసి హవాయి చెప్పుల్తో నలిపేసి)

శే: మీ....రు.

సు: ఎక్కడ మా వెధవ?

శే: ఇక్కడ చాలామంది ఉన్నారు. ఎవరండి మీ—

సు: వాడే మా అబ్బాయి ప్రసాద్.

శే: ఒహో ప్రసాదండీ! ఇంతవరకూ మేమిద్దరం కంబైన్డ్ స్టడీస్ చెశాం. ఇప్పుడే రిలీఫ్‌కని బయటికెళ్ళినట్లున్నాడు. నా రూమ్‌లో ఉండండి అందాక.

సు: నేను ఇక్కడ ఉండటానికి రాలేదోయ్! మా ఊరివాళ్ళం చాలామంది పని మీద వచ్చాం. హోటల్లో గదులు తీసుకున్నాం. ఏదో కంబైన్డ్ స్టడీస్ అంటున్నావు. నాకు తెలియందేముందిలే. నేను నలుగురు పిల్లల్ని ఈ కాలేజీలంతా చదివించాను.

శే: (నసుగుతూ) ఏదో కుర్రవాళ్ళం గదండీ!

సు: అవునవును కుర్రవాళ్ళేగాని కొట్లాటల్లోను, గలాటాల్లోను కాళ్ళు చేతులు విరుచు కోకుండా, పోలీసు స్టేషన్ల పాడన కుండా ఈ కాలేజీలు బయట పడితే సంతోషిస్తాను, లేకపోతే ఏ మినిష్టర్నో పట్టుకొని విడిపించుకోడం. కోర్టులంట తిరగడం బాధ మాకుండదు. ఇంతకీ మీ ఇంటి పేరేమిటబ్బాయి?

శే: చూడండీ! మీరేమనుకోక పోతే ఒక మాట అంటాను. మీరు అసలు పేరుకన్న ఇంటిపేరు కెందుకో అంత విలువనిస్తారు అంతమంచిది కాదని మా అభిప్రాయం

సు: ఏదో ఊసు కడిగాను. లేలోయ్! ఘటికుడిలా ఉన్నావే; సరేగాని మా వాడు క్లాసులకు వెళుతున్నాడా! అయినా మీ అందరూ ఒకటేలే! ఒకరి గుట్టు ఒకరు బయటపెట్టరు. నిన్ను చూస్తే మాత్రం నాకు సంతోషంగా ఉంది ఎడారిలో ఒయాసిస్సులా ఒకడివే పుస్తకంతో తంటాలు పడుతున్నావ్!

(అంతలో టీకి వస్తావురా. అని కేక వేసుకుంటూ విక్రమ్ ప్రవేశం)

వి: (తృళ్ళిపడి) అబ్బే ఏదో అలా వెళ్దామని....

సు: రా అబ్బాయి కూర్చో.

వి: ఒట్టినే వచ్చానండీ! చిన్న నోట్సు కావాలి రిఫర్ చేద్దామని.

సు: అవునవును. సరిలే ఇంతకీ నువ్వూ మా ప్రసాద్ ఒకటే క్లాసా

వి: అవునండి. మేమిద్దరం బెస్ట్‌ఫ్రెండ్స్

సు: చూడండబ్బాయిలూ! మీ మేష్టార్లు ఏమైనా చెప్తారంటారా?

శే: అలాగంటారేమండి. కాస్త జూనియర్ లెక్చరర్లు తడుముకుంటారు గాని, మొత్తంమీద ప్రొఫెసర్లు గట్రా బాగానే చెప్తారు.

వి: అవునండీ బాగానే చెప్తారు.

సు: కాని, మీరే విననంటారు? ఎందుకడుగుతున్నానంటే మొన్న మా స్నేహితుడొకడు వాళ్ళ అల్లుణ్ని పరిచయం చేసేడు. అతను మీ కాలేజిలోనే లెక్చరర్ అట. వాలకం అదీ చూస్తే పిట్టల దొరలా ఉన్నాడు. వాక్శుద్ధి కూడా శూన్యమే. సరే రేపు ఉదయం వస్తాను. మా వాణ్ణి కొంచెం కనిపెట్టుకొని ఉండ

మనండి ఏ మోర్నింగ్‌షోకో కొట్టకుండా
వి: అలాగేనండి.

(సుబ్బరామయ్య నిష్క్రమణం)

వి: ఈ పేరేంట్స్‌తో ఇదే గొడవ. మని యార్డర్లు సమయానికి పంపరుగానిఇలాంటి సర్ ప్రైజ్ విజిట్స్ మాత్రంచేస్తూటాంరు.

శే: ఈ ముసలాయన దేవాంతకుడిలా ఉన్నాడు. జాగ్రత్తగా పంపించేసాము. రేపు ప్రసాద్‌గాడికి చాలా ప్రిపరేషన్ అవసరం.

వి: సరేగాని, అలా ఒక రౌండ్ కొట్టి వద్దాం. నాకు బోర్ కొడుతోంది.

శే: రేపు చెప్తు కదా? మర్యాదకైనా పుస్తకం తీశానా? ఒక్క ముక్క కూడా చదవలేకపోతున్నాను.

వి: చదవడం ఏమిట్రా? ఔట్ ఆఫ్ ఫాషన్. అసలు 'మన విద్యా విధానం మారాలి' 'పరీక్ష విధానం మారాలి' అని పేపర్లో చదవడం లేదూ! ఇదంతా డొల్లు బుచ్చకాయ వ్యవహారం! దీనికి ప్రిపరేషన్ ఒకటా!

శే: అయినా నాల్గు ముక్కలు వ్రాయడం మన కనీస ధర్మం కదరా!

వి: ఏం వ్రాస్తానో ఏమో! మనల్ని బందిలి దొడ్లో పెట్టినట్టు ఒక గదిలో పెడతారు. గంట మ్రోగించి గడ్డిపడేసినట్టు పేపర్లు, కాగితాలు పారేస్తారు. అవి మన్నరెంకో, మూడో గంటలు నమలాలి. ఎవడు బాగా నమిలితే వాడే పాసు, పాపం పన్నునొప్పి వల్లో, కడుపులో వికారంవల్లో, బుర్రలో వెర్రి మొర్రి ఆలోచనలవల్ల ఎవరైనా నమల్లేక పోతే ఫెయిల్, ఇదేగదా పరీక్ష.

శే: ఏడిసినట్లుంది నీకాంప్రహెన్షన్! మరీ అంత చులకనగా మాట్లాడకు.

వి: నీవు ప్రేమించిన అమ్మాయి పరీక్షలముందు నీకో షాక్ ఇచ్చిందనుకో అప్పుడు నువ్వేం చేస్తావు?

శే: డోంట్ బి సిల్లీ, ఇప్పుడున్న పరీక్షా విధానం బాగులేదన్నావ్ సరేగాని ఉన్న దాంట్లో మనం కొంత బాగవడానికి ప్రయత్నించాలంటే ఒప్పుకుంటావా?

వి: సిన్సియర్‌గా వ్రాయాలంటావ్! అది ఒక ఆదర్శంగా పెట్టుకుంటే బాగానే ఉంటుందికాని బయట ప్రపంచంలోలేని సిన్సియారిటీ నువ్వూ నేనూ పరీక్షలు తిన్నగా వ్రాసినంతమాత్రాన వస్తుందంటావా?

శే: ఇప్పుడు నీతో వాదోపవాదాలకు నా కోపికలేదు, నీవేదో 'టీ' అనుకుంటూ వచ్చావ్‌కదూ! వెళ్ళి తాగిరద్దు. నాకిప్పుడు తాగాలని లేదు.

వి: సరే. తోడు లేకపోతే నేను వెళ్ళనూ

(విక్రమ్ నిష్క్రమణం)

శే: ఏం గాలివాన! పుస్తకం ముడితే ప్రళయం.

(శేఖర్ మళ్ళా చదవడానికి ప్రయత్నిస్తాడు.)

('ఏం ఫిగర్ గురూ' అని కేకవేస్తూ సాయికుమార్ ప్రవేశిస్తాడు.)

శే: (చిరాగ్గా) ఇవాళింతే!

సా: నీవు చూడవలసింది గురూ! అసలీ ఆంధ్రలో అమ్మాయిలే బేక్ వర్డ్.అందులో వైజాగ్‌లో అమ్మాయిలింకా బేక్ వర్డ్. అలాంటిదీ రోజు ఏం సీను! ఏం సీను! చూస్తేగాని చెప్పలేము

శే: నీ ఆయాసం తీర్చుకొని తాపీగాచెప్పు కొంపలంటుకుపోవు.

సా: అసలు నీ సహాయం చాలా కావాలి. ఏం కట్టింది గురూ ఆ సారీ! బొడ్డు కిందకు! ఎక్సెలెంట్ ఫిగర్.

శే: అదా విశేషం.

సా: అసలు నీ ద్వారా ఆ అమ్మాయి వివరాలు వగైరా తెలియాలి గురూ!

శే: ఏంటోయ్! నువ్వనేది. బొడ్డు కిందకు చీరె కట్టుకున్న అమ్మాయిల ఎడ్రసులన్నీ నా దగ్గరుంటాయంటావా?

సా: కాదు గురూ: ఆ అమ్మాయిది విజయనగరం. నీది కూడావిజయనగర మేగా? అందుకే నీకేమైనా భోగట్టా తెలుస్తుందని.

శే: ఆ అమ్మాయిది విజయనగరమని నీకెవరు చెప్పారు?

సా: ఆమాత్రం ప్రిలిమినరీ ఇన్‌వెస్టిగేషన్ చేయకుండా విడిచిపెడతానా! అందుకే ఇంత ఆలస్యం అయింది.

శే: బహుశా కొంచెం నాజూకు మోతా దెక్కువలో డ్రెస్ చేసుకున్న అమ్మాయిని చూసుంటావ్, కానీ అంతలోనే అక్కి యుడి వైపోతున్నట్లు మాట్లాడుతున్నా వేంటి?

సా: షి సిమ్‌ప్లీ ఎట్రాక్టెడ్ మి!

శే: 'సిమ్‌ప్లీ' ఎంత తేలిగ్గా చెప్పావ్. ఇలాంటి విషయాలు అలా అలావదిలేస్తేనే ఆరోగ్యం.

సా: ఏంటోయ్! వేదాంతిలా మాట్లాడు తున్నావ్?

శే: కొంచెం ఉన్నదున్నట్లు చెపితే అలాగే ఉంటుందిలే.

సా: నువ్వు రాను రాను మరీ డల్‌గా అయిపోతున్నావే.

శే: నేను నీలాగే హుషార్‌గా ఉంటూ ఉంటూ ఈ రకమైన డల్‌నెస్‌లోకి దిగాను. నీకే తెలుస్తుందిలే ఒకటి రెండు పార్లు ఆ హుషారు మజా రుచి చేస్తే.

సా: గుడ్‌నైట్. సాయికుమార్

(నిష్క్రమణ)

('అమ్మయ్య' అనుకుంటూ శేఖర్ మరల చదవడానికి ప్రయత్నిస్తాడు.)

(అప్పుడే నిద్రలేచిన ముఖంతో వెంక

ట్రావు ప్రవేశం.)

వెం: శేఖర్! నాకో వింత కలొచ్చింది.

విను. జస్ట్ . చేరపడ్డాను. అంతలోనే.... గమ్మత్తుగా ఉందిలే.

ష: అదేదో చెప్పు. మరేం చేస్తాను. వినక తప్పుతుందా!

వెం: ఏంలేదు. మన హాస్టల్ ఇనాగరల్ ఫంక్షన్ అట. అంతా కోలాహలంగా ఉంది. నేను డాబాపైన గులాబీపువ్వు పట్టుకొని వాసన చూస్తూ, ఎదురుగా చూస్తున్నాను....

శే: దీనికేనా పెద్ద హంగామా?

వెం: అసలింకా ఉందోయ్! అంతలో ఒక అమ్మాయి అలా అలా.... ఆల్‌మోస్టు ఎగురుకుంటూ వచ్చింది. నేను ఆ గులాబీపువ్వు విసిరాను. అది సరిగ్గా ఆ అమ్మాయి హృదయానికే తగిలింది.

శే: ఆ అమ్మాయిచీవాట్లు పెట్టిందా?

వెం: అలాగైనా బాగున్నోయ్, ఆ అమ్మాయి చిరునవ్వు నవ్వింది....ఎన్నో ఊహించుకుంటూ దగ్గరకు వెళ్ళాను. క్షమాపణ చెప్పాలను కున్నాను..... ఏమేమో అనుకున్నాను.

శే: మాయమైందా?

వెం: కాదోయ్! దగ్గరకు వెళ్ళగనే తనే ముందు 'మీరు విసరాలని విసరలేదని నాకుతెలుసు. ఏదో అయింది. దీని గురించి పట్టించుకోకండి' అనేసిందిరా! నేను సీఘ్ఖకారిపోయాను. అంతలో తెలివొచ్చేసింది.

శే: బతికి బయటపడ్డావులేగాని పోయి ఆ నిద్ర కంటిన్యూ చెయ్యి. మళ్ళీ వెలిడెక్ట్రీఫ ంక్షన్‌లో కనిపిస్తుదేమో!

వెం: పోవోయ్! పిల్లి పెళో! నీకు చెప్పడమే పొరపాటు

(వెంకట్రావు నిష్క్రమణం)

(శేఖర్ మళ్ళా పుస్తకం తీయాలని ప్రయత్నించి)

శే: నిద్ర ముంచుకొచ్చేస్తుంది. ఈ క్షణ కింతే!



# శిక్ష

(గత సంచిక తరువాయి)

"త్వరగా వెళ్ళి కారు తీశాడు. దుర్గమ్మ వెళ్ళి కూతుర్లను లేపింది. అందరూ వచ్చి నగలకోసం చూశారు. దుస్తులు పెట్టెలూ అన్నీ ఉన్నాయి,
కాని నగలు మాత్రం లేవు.

"దీని సిగ తరగా? కొంపే ముంచి వదే. చలపతికి ఏమని జవాబు చెప్పనే.

"గుండెలు బాదుకుంచి ఏడ్వడం మొదలు పెట్టింది. మేడ మీదున్న చలపతికి ఏమీ వినిపించలేదు. గాని క్రింద పనివాడు డ్రైవరూ అందరూ లేచి వినోదం తిలకించ సాగేరు.

నాల్గు గంటలకు తిరిగివచ్చిన వెంకట్ సుశీల జాడ తెలుసుకుని రాలేక పోయాడు చుట్టూ వెతికాడు యెక్కడా కనిపించ లేదని చెప్పాడు.

"పదండే పనులు మొదలు పెడదాము.
పనిమనిషి కదిలింది.

"ఇంకేం పనులే. పెళ్లికూతురే లేదు. పెళ్లి ఆగిపోతుంది. మెల్లగా చెయ్యోక్కచ్చి పడుకుందాం పద.

"పెళ్ళి ఆగిపోవడానికి వీలులేదు వెళ్ళి మీ మీ పనులు చూసుకోండి

"దుర్గమ్మ మాటలకు అందరూ వెళ్ళిపోయారు.

"అమ్మాయె! ఏమిటి నీ కేమో పిచ్చెత్త

మాదిరెడ్డి సులోచన

లేదుకదా?

"ప్రసన్న ఊపింది.

"ఇప్పుడు లేదు ప్రసూ: ఈ పెళ్ళి ఆగిపోతే యెత్తుతుంది. అరవై కాసుల బంగారం తెమ్మని చలపతి పీకలు నొక్కాడు యెక్కడ తేను.

అమ్మ బ్రతకాలంటే, యింటి పరువు నిలపాలంటే, శశీ: నువ్వు పెళ్ళికూతురివి కావాలి. కావు? నా ఆజ్ఞ ఉల్లంగిచకు. ఊం.

"అమ్మా!"

"తీమ్మా, బొమ్మా ఏమీలేదు. నా మాట వినాల్సిందే. లేదా రేపు అందరము యీ లోకములో ఉండము. ప్రసన్నా! లే దాన్ని పెళ్ళికూతుర్ని చెయ్" అని రెండేసి మెట్లు ఒకేసారి యెక్కుతూ మేడపైకి వెళ్ళిపోయింది దుర్గమ్మ.

"అక్కా!" ప్రసన్ననను కౌగిలించుకొని బావురుమంది శశి. "చూడక్కా! అమ్మ యెంత అన్యాయం చేస్తుందో."

"అమ్మ విధిలేక ఈ నిర్ణయానికి వచ్చిందే. నువ్వే ఆలోచించు. రేపు నేను ప్రేమ ఏమవ్వాలి? ఉన్న ఆస్తి యిచ్చి ఆ శంకరంగాడికి కట్టబెట్టినా తిన్నగా చూస్తాడని నమ్మకమేమిటి? అందరి పరువూ నీ చేతిలో వుందే శశీ!"

శశి హృదయం రాయి ఐపోయింది. యవ్వనమదంతో కళ్ళు మూసుకుని తిరిగినందుకు శిక్ష అనుభవించవల్సిందే. ఆమె కంటిలో కన్నీరుకూడా ఇంకిపోయినది.

"మామయ్యా! అప్పుడే లేచి ఈజీ ఛేర్‌లో కూర్చున్న చలపతి పాదాలను వాటేసుకుంది దుర్గమ్మ. "నన్ను రక్షించు మామయ్యా! నా కెవ్వరూ లేరు. అన్నీ నువ్వే.'!

అతను తెల్లబోయాడు. ఆమెను బలవంతంగా పాదాలు విడిపించి, ప్రక్కన కూర్చోబెట్టాడు. "ఏం జరిగిందో చెప్పు దుర్గా!"

"ఏం చెప్పను యీమయ్యా! అదే, ఆ పిల్లదానికి నీ గురించి అంతా చెప్పాను. పెళ్ళికి సంతోషంగా ఒప్పుకుంది. నిన్ను చూచికాదు. నీ డబ్బుని తెలుసుకోలేకపోయాను. సరదాకు చేయించిన నగలన్నీ పెట్టాను. అవన్నీ తీసుకుని ఉడాయించింది. నా కొంప ముంచింది."

"ఆ(....అరవై కాసుల బంగారం పోయిందా దుర్గా. నిజమేనా?" ముసలాడు ఉగ్రుడయిపోయాడు,

"నిజమే మామయ్యా! పాముకు పాలు పోసి పెంచాను. నన్ను నిలువునా కూల్చింది."

"దుర్గా! ఇదంతా యేదో నాటకంలా ఉంది. నా బంగారం పోతేపోయింది. నీ చెవులు పిండి తీసుకుంటాను. నా పరువేం గాను! యింకా నయము అందరికీ చెప్పలేదు. దగ్గిర బంధువులకు మాత్రం చెప్పాను. మీరు యెట్టాన్నా చావండి. గుట్టుగా నా బంగారంతే నాకు అప్పగించు" ఆవేశంతో ఊగిపోయాడు చలపతి.

దుర్గమ్మ మరోసారి అతని పాదాలను ఆశ్రయించినది. అందితే జుట్టు అందక పోతే కాళ్ళు అనే సామెత ఉండనేవుంది. మేనగోడలు నిచ్చానని అతని జుట్టుపట్టి అడిద్దామనుకుంది దుర్గమ్మ. కాని అతని కాళ్ళు పట్టుకునే గతి పట్టినది. "నా మాట విను మామయ్యా! ఈ పెళ్ళి ఆగిపోదు. అది మోసగించినందుకు శిక్ష నేను అనుభ విస్తాను. నా కూతుర్ని ఇస్తాను మామయ్యా! బంగారము నెమ్మదిగా కొని పెడ్తాను. నా పరువు కాపాడు. పోలీసు లకు రిపోర్టిచ్చి యెక్కడున్నా దాన్ని పట్టి తెప్పిస్తాను. నా బిడ్డను చేసుకో మామ!"

అతను ఆశ్చర్యపోయాడు. దుర్గమ్మ మీద జాలి కూడా తలచాడు. పరువుకోసం బిడ్డను బలిచేస్తుంది అనుకున్నాడు. సుశీలను సరిగా అతడు చూడలేదు. ప్రసన్నను చూచాడు. అతని హృదయం పొంగిపో యింది.

"లే దుర్గా! మనలో మనకు ఈ పట్టింపులు దేనికి? పరువు పోతుందే అని అలా అన్నాను కాని బంగారము నీకంటె యెక్కువా? లే, ప్రసన్నను అడిగావా? దాని కిష్టముందో లేదో,"

"ప్రసన్నకాదు మామయ్యా, శశి! నా రెండో కూతురు."

"అదేమిటే పెద్దదాన్నంటేపెట్టి రెం డవ దాని యిస్తానంటావు?" ఆశ్చర్య పోయాడు.

"అది యిదివరకే మాటయ్యింది. దాన్ని చూచి వెళ్ళారు. దీన్ని చేసుకో. దాని కిష్టమే. మీ ,హోదా, కారు చూచి కరిగిపోయింది." వచ్చే దుఃఖాన్ని అపు కుంటూ క్రిందికి వచ్చింది దుర్గమ్మ,

విధి బలీయమైనది తెలియక మిడిసి పాటు పడతాం. తానొకటి తలంచింది. జరిగింది వేరొకటి.

గంభీర వదనుడై యింట్లో అడుగు పెట్టిన ఉమాపతికి యింట్లోని వాతావరణం కూడ గంభీరంగానే కనిపించినది.సామాన్లు గదిలో పెట్టించి యెదురుగా భార్య కనిపిం చినా పలుకరించక సోఫాలో కూర్చున్నాడు దుర్గమ్మ నిగ్రహించుకోలేక పోయింది. అతని భుజంమీద తలవాల్చి గుండెలు అవిసేలా దుఃఖించినది. "ఎందుకు ఏడుపు నీ పంతము నెగ్గినదిగా!" కఠినంగా అడిగాడు.

"నాన్నా! ఈ రోజు పత్రిక చూడ లేదా?" వెంకట్ పత్రిక అందించినాడు. ఉమాపతి ఆశ్చర్యంగా పేపరు విప్పాడు సుశీల ఫోటో దాని కింద అరవై కాసుల బంగారముతో పరారి పట్టి యిచ్చిన వారికి మూడువందల రూపాయలు బహు మానము అని ఉంది యెందుకో అతని హృదయ భారమూ తగ్గినట్లు అనిపించినది

"ఏడుపు దేనికి? నీ యిష్టమొచ్చినట్లు నువ్వు అధికారం చెలాయించావు. దానికి చేతనైన పని చేసినది" ఆమెను దూరంగా

జరిగాడు. ఇంతలో శశి వచ్చి అతనికి వంగి నమస్కరించినది. అతని కంతా అయోమయంగా ఉంది.రకరకాల వస్తువులు ధరించి, సీతాకోక చిలుకలా జాలిగా తిరిగే శశి గంభీరముగా, వాడిన పువ్వులా, బిగుతుగా జడ వేసుకుని మెడలమీద పైట ముసుగుతో రావటం నమస్కరించటము అర్థంకాలేదు' "అది చేసిన అనర్థపు పనికి శశిని బలియిన్నాను." రెండు చేతులతో ముఖం దాచుకుంది. వెంకట్ జరిగినదంతా చెప్పాడు. ప్రసన్న నెమ్మదిగా శశి పరిస్థితి చెప్పింది. యేపరిస్థితులో పెళ్ళి చేయవలసి వచ్చినదో వివరించింది.

"నీ పాపం నీకే బెడిసినదా దుర్గా' రఘుకు అన్యాయం చేశావు. దేవుడు మనకు అన్యాయం చేశాడు బాగా లేదూ! ఒక్కపని చెయ్యాల్సిందే అతనికిచ్చేకంటే దానికింత విషం యివ్వక పోయావూ? తప్పు నీది గాదే. నాది నీకు నీ డబ్బుకు దాసుడనై చెప్పినట్టు విన్నాను. ఈ పాపమంతా నాది" అతను లేచి గదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకున్నాడు.

"ఏర్రా దానిజాడ తెప్సిందా?" కొడుకు వంక చూచింది.

' లేదమ్మ పేపర్లోయిచ్చాము, ఇవాళో రేపో తెలియాలి. సాయంత్రము శశిని తీసుకు పోవటానికి చలపతిగారు వస్తామన్నారు."

"రాని. పెళ్ళిచేశాము. ఆ రోజు దాని వొంట్లో బావుండలేదని సాకు పెట్టి వచ్చాము ఈ రోజు తప్పుతుందా?" అక్కడ నిలబడలేక పోయింది శశి.

సాయంత్రము చలపతిగారు వచ్చారు. మనసును మభ్యపెట్టి అల్లుడికి చేసే మర్యాదలు చేసింది దుర్గమ్మ. ఉమాపతి ముభావంగా పలుకరించి ఊరుకున్నాడు భోజనాల వద్ద శశిని తీసుకుపోయే ప్రస్తావన వచ్చింది. ఇప్పుడే ఏం తొందర?" దాటేయ్య బోయింది దుర్గమ్మ.

బావుందే వయసు వస్తుందా పోతుందా? ఇల్లు పాడు పడి బావురుమంటుందనే ఈ వయస్సులో పెళ్లిచేసుకుంది." నిక్కచ్చిగా తన అభిప్రాయాము చెప్పాడు చలపతి. దుర్గమ్మ నోరు యెత్తలేదు. శశి బట్టలు సర్దుకో సాగింది. రోట్లో తల పెట్టాక రోకలి పోట్లకు జడిస్తే లాభమేమిటి? వార్తా పత్రికలోని ప్రకటన చలపతి వెంబడి పోయే శశిని చూచి ఏం జరిగినదో కొంత బాగం అర్థం చేసుకుంది అనసూయ అంత తేలిగ్గా ముసలివాడికి దుర్గమ్మ తన కూతుర్నిచిందంటే దాని వెనకాల ఏదో గూడిపుటాని ఉందని ఊహించి. సుశీలను తలుచుకుని రెండు అశ్రు బిందువులు రాల్చింది. భర్త ఊళ్లో ఉన్నా తన పని తేలికయ్యేది యెక్కడని వెతుకుతుంది, ఒంటిగా కూడా కాదు వెంట బంగారముందాయె దొంగలు మోసగాళ్ళు పట్నం నిండా ఉన్నారు. యెటుపోయిందో ఏం చేస్తోందో ఒకటే అందోళన చెందినది.

యే ఆందోళనలేక వేదాంతిలా ఉన్నవాడు ఉమాపతి మాత్రమే.

సుశీల నీరసముగా కళ్ళు విప్పింది. గదంతా పట్టపగలులా ఉంది, ఇంకా యెందుకు ప్రొద్దుక్రుంకలేదా అని విసుక్కున్నది. తనెలా యిక్కడికి తేబడినది? మృత్యువును కౌగిలించుకోవాలని కారుకు అడ్డముగా వెళ్ళింది ఆ తరువాత ఏం జరిగింది జ్ఞాపకం లేదు. తిరిగి తెలవి ఆ రోజు ఉదయమే వచ్చింది. తను యెలా తేబడిందని అడిగితే యెవరూ జవాబు చెప్పరు. రెట్టిస్తే "సాయంత్రం ఆయన వస్తారు. అడుగు." అంటారు, యెవరాయన? వెంకట్ కాదుగదా! భగవంతుడా! దయామయుడ వంటారు. నన్ను నీదరికి చేర్చుకోలేక పోయావా? చేయి యెత్త బోయింది. విపరీతమయిన నొప్పి వేసింది. తలకు బ్యాండేజి ఉంది కదలటాని మహాబాదగా ఉంది ధర్మామీటరు తీసుకునినర్సు వచ్చింది నోరు తెరువు." ధర్మామీటరు నోట్లో పెట్టి పల్సు చూచినదఅన్నీ చార్జి షీటుపై నోట్ చేసింది. నర్స్: ఈ రోజు తారీఖుయెంత?

మార్చి తొమ్మిదో తారీఖు అని బ్లాంకెటు సరిగా కప్పి వెళ్ళిపోయింది.

"అయితే నేను యిక్క చేర్చబడి నాల్గు రోజులయిందా? మార్చి అయిందో తారీఖు ఉదయం తన పెళ్ళి! .... ఏమయిందో' అత్తయ్య యెంత మండిపడుతుందో! పాపం మామయ్య మంచివారు తన పెళ్ళి చూడలేక వెళ్ళిపోయారు "ఆలోచనలు తరంగాలుగా వస్తున్నాయి. కళ్ళు మూసుకుని మగతలోనికి జారినది. నాల్గు జతల బూట్లు శబ్దం వినిపించింది. అవి తన మంచం దగ్గర ఆగిపోయాయి" సుధీర్ ఆమె తెలివిలోకి వచ్చింది. ప్రమాదము తప్పినట్లే" ఒక గొంతు పలికింది "మద్యాహ్నము నేను రౌండ్సుకు వచ్చినప్పుడు పూర్తిగా స్పృహలోకి వచ్చే మాట్లాడినది" మరోగొంతు ఇవాళ రేపు ఆడ పిల్లలు కూడా బరి తెగించి పోయారు కార్లకు అడ్డం రావటం మనల్ని తికమక పెట్టటం. నేనైతే ప్రక్కకు ఈడ్చి వచ్చేవాడిని" మరో గొంతు పలికింది మగత వదిలించుకొని బలవంతంగా కళ్ళువిప్పింది యెదురుగా యిద్దరు డాక్టర్లు మెడలలో స్టెతస్కోప్ వ్రేలాడ వేసుకుని నిల్చున్నారు మరో యిద్దరు యువకులు నిల్చున్నారు. వారిలో సుధీర్ యెవరా అని ఆలోచన! డాక్టర్లు ఓ యువకుడితో కరచాలనం చేసి వెళ్ళిపోయారు "నేనూ వస్తాను ప్లాజాలో మంచి పిక్చరుంది. నీతో పెట్టుకుంటే కుదరదు. దారిన పొయ్యే కంపను నెత్తికి రుద్దుకుంటావు." అన్నాడు అక్కడ నిల్చున్న పొట్టి అతను. ఖరీదయిన సూటులో వున్నాడు.

"నీకు సినిమాలు, తిండి, డ్రస్సు తప్ప ఏది ముఖ్య మనిపించదా? జాషూ?"

"ఇంకేదిరా ముఖ్యం: బ్రతకటానికి తింటాము. ఆరోగ్యంగా కండలు పెంచడా

జీతాలు ఎక్కువ చేసి తీరాలని పిటిషన్‌లో
సంతకాలు చేసింది మీరే కదూ?

సత్యమూర్తి

నికి మంచి ఆహారము కావాలి సంఘములో పెద్దమనుషులుగా చెలామణి కావటానికి విలువైన దుస్తులుండాలి. కొన్ని క్షణాలు సర్వం మరచి ఆనందించటానికి సినిమాలు కావాలి" అన్నాడు. గర్వంగా.

"నీతో వాదించలేను. అవతల పేషెంటు ఉంది. బాస్‌కు ఫోను చెయ్యి ఈ రాత్రికి నాకు సెలవు కావాలని. విష్‌యూ గుడ్ లైమ్," జాషా అనే అతను వెళ్ళిపోయాడు. సుధీర్ ఇటు తిరగగానే కళ్ళు మూసుకుంది సుశీల. అతను కుర్చీలాక్కొని కూర్చున్న శబ్దమయింది. అతనెవరో తెల్సుకోవాలనే ఆరాటం యెక్కువైంది. కళ్ళు విప్పి ప్రక్కకు తిరుగబోయినది.

వద్దు అటు తిరక్కండి ఆ చెయ్యి చాలా నొప్పిగా ఉండవచ్చు" అతను ఆదుర్దాగా లేచాడు.

"మీ రెవ్వరు? నేను ఇక్కడికి యెలా ....యెలా వచ్చాను. అతనివంక సూటిగా చూచింది.

"నేనే యిక్కడకు తీసుకొచ్చాను. నన్ను సుధీర్ అంటారు. మీరు నాకారుకు అడ్డు వచ్చారు. ఇది నర్సింగ్ హోం. ప్రమాదం తప్పింది. మూడు రోజులు స్పృహలేకుండా పడివున్నారు. ఇప్పుడింకేం మాటలు వద్దు, రేపు మాట్లాడదాము" ఆజ్ఞాపించినట్లే అని, మగ్గులో పాలు తెచ్చాడు. నోరంతా చేదుగా వుంది,

పాలను చూడగానే అసహ్యం వేసింది. అతను మెడక్రిందుగా చేయివేసి కొంచెం పైకి లేపి, మగ్గు నోటిదగ్గరకు తెచ్చాడు. కడుపులోని అలజడి అపుదామని రెండు గుటకలు వేసింది. అంతే భుళ్లున డోక్కున్నది. అతను టవలు అడ్డం పెట్టాడు. అయినా అతని చేతులన్నీ పాడయిపోయాయి. భయంగా చూచింది. ఫరవాలేదన్నట్టు చూచాడు. వేరొక గుడ్డతో అంతా శుభ్రంగా తుడిచి పడుకోబెట్టాడు. డాక్టరు తిరిగివచ్చి ఓ ఇంజెక్షన్ చేశాడు. అంతే గాఢంగా నిద్రపోయింది. తెల్లవార్లు అక్కడే వుండి, ఉదయం వెళ్ళిపోయాడు సుధీర్,

* * *

"....లేదు. నన్ను నమ్మండి. నేను అన్నీతీసి పెట్టెలో పెట్టి వచ్చాను. ఇల్లు దాటి పది అడుగులు వేశానో లేదో కారు వచ్చింది. నాకా సొమ్ముల గురించి ఏమీ తెలియదు" ఒడిలోనున్న పేపరు చూచి కంపించిపోయింది సుశీల. తనఫోటో.... క్రింద దొంగతనం చేసినట్టు వివరాలు.

"మీరు తీసుకురాకుంటే భయంలేదు. కాని పెద్ద చిక్కు వచ్చిందే. మీరు బయటికి వచ్చిన మరుక్షణం పోలీసులు పట్టుకుంటారు డాక్టర్లకు తెలుగుపేపరు చూచే అలవాటు లేదు. నర్సులంతా అరవవారు. అందుకే మీ ఉనికి బయటపడలేదు ఇంకా రెండు రోజులు చూచి అన్ని పేపర్లకిస్తారు."

"నన్ను యెందుకు తెచ్చి కాపాడారు. నా కెవరూ లేరు. అన్ని అనుభవాలు అయ్యాయి. ఇక జైలుకి వెళ్ళటం కూడా రాసిపెట్టి ఉందేమో! దయచేసి నాకింత విషం యిప్పించండి" రెండు మోకాళ్ళ నడుమ తలపెట్టి ఏడవసాగింది.

"చూడండి. జీవితం అంతం చేసుకోవటానికి కాదు భగవంతుడిచ్చింది. మీరు బుద్ధి తెలిసినప్పటినుండి కష్టాలే అనుభవించారు. కాబట్టి అలా అంటున్నారు. నాకు కొన్ని విషయాలు నెమ్మదిగా చెప్పండి. నగలు తీసిందెవరో తెల్సుకోవడానికి ప్రయత్నిస్తాను" ఆదరముగా అడిగాడు. ఏం చెప్పాలన్నట్టు చూచింది. "మీరు నగలు పెట్టెలో పెట్టినప్పుడు యెవరయినా చూశారా?"

"అవును, గుర్తుకొచ్చింది. వెంకట్ బావ చూశాడు. గదిలో వుంది పిల్లలూ నేను."

"పనిమనుషులు ఎంతమంది? వారు ఎక్కడ పడుకున్నారో తెలుసా?"

"ఆ. ఒక వంటమనిషి, ఒకమ్మాయి వడ్డనా, చిల్లరపనులూ చూస్తుంది. మాలి ద్రయివరు. మాలిద్రయివరు బయట పడుకున్నాడు. వంటమనిషి, అమ్మాయి హాల్లో పడుకున్నారు."

"మీరు రాగానే వీరెవరయినా చేయొచ్చుగా? మీరు నిశ్చింతగా ఉండండి. మీకేం తినాలని ఉన్నా నిర్మొహమాటంగా నాకు చెప్పండి. మీ మీదకు ఏ నేరము

రాకుండా చూస్తాను. కొంచెము నగల వివరాలు చెప్పండి" తన డైరిలో అన్ని వ్రాసుకున్నాడు.

"దయచేసి ఫోనుచేసి మామయ్యను పిలిపించగలరా?"

"అతనే పోలీసులకు చెప్తే? రెండు రోజులు ఆగండి."

"అతను అలాంటివారు కాదు. అతను వస్తే మీకు కొన్ని వివరాలు దొరక వచ్చు."

"అయితే నేనేవెళ్ళి తీసుకు వస్తాను." సుధీర్ వెళ్ళిపోయాడు. మరో రెండు గంటలలో ఉమాపతిని వెంటబెట్టుకొని వచ్చాడు. ఉమాపతి సుశీల చెప్పిన విష యాలు నమ్మాడు. అతను శశి పెళ్ళి విషయం చెప్పితే నమ్మలేకపోయింది సుశీల. కొడుకు తత్వము తెలిపిన చలపతి అతన్నే అనుమానించారు. అతని పూర్తి వివరాలు, స్నేహితులగూర్చి సుధీర్‌తో చెప్పాడు. సుధీర్ తలాడించి వెళ్ళి పోయాడు.

వెంకట్ ప్రియురాలివద్ద నగలు కొన్ని దొరికాయి. కొన్ని మార్వాడి కొట్లో వెయ్యి రూపాయలకు తాకట్టు పెట్టినట్లు తెలిసింది. సుధీర్ స్నేహితుడు మారు వేషంలో వెంటాడినాడు వెంకట్‌ను. నిజం గ్రహించాక ఉమాపతిని పిల్చుకుపోయారు. నగలు విడిపించడానికి వెయ్యి' పోలీసుల నోరు మూయ్యడానికి అయిదువందలు ఖర్చైయినది. "నేను అప్పుడే ఆ మాట ఏమిటిరా అని అడిగాను. మష్టరు అంటే నిజమే కాబోలు అనుకున్నాను. యెంత పని చేశావురా వెంకట్!" దుర్గమ్మ వాపో య్యింది. కొందరు కొన్ని తప్పులకు శిక్ష అనుభవించగానే మారిపోతారు. దుర్గమ్మ విషయంలో అలా జరగలేదు. తనకూతురు జీవితం నాశనము కావటానికి తన కుమా రుని బ్రతుకు బయట పడటానికి కారణం సుశీలనే తలుస్తుంది. ఆమె మీద మును పటి కంటే యెక్కువ కసిగా ఉంది. యెదురుగా ఉంటే గొంతు నులిమి చంపే దును అన్నట్టు ఉందామెకు. ప్రసన్న పరీక్షలకు చదువలేక పోతుంది. కొత్త వంటమనిషి చాలా గొడవ చేస్తుంది. మునుపటిలా మనిషికో రకం అమరటం లేదు. వంటచేసి వెళ్ళిపోతుంది. వడ్డన ప్రసన్న నెత్తిన పడింది.

నగలు అప్పగించి రావటానికి చలపతి యింటికి బయలుదేరినది దుర్గమ్మ "మీరు రండి" అన్నది.

"నేనెందుకు? ముచ్చట పడి బ్రాహ్మ డితో కన్యాదానం చేయించి. తెచ్చుకున్న అల్లుడు పెళ్ళి చూచిరా" వెటకారంగా మాట్లాడినాడు ఉమాపతి, డ్రైవరును తీసు కుని వెళ్ళింది, చలపతి పురుగును చూచి నట్లే చూచాడు.

"యెంత నాంగ నాచిలా పరాయి పిల్ల మీద పెట్టావే దొంగతనం? అయింది

చాలు. నీపిల్లలను ఈ ఛాయలకు పంపకు. పెళ్ళి చేసుకో. నీ కూతుర్ని యిస్తాను అంటే మోసపోయాను. ప్రపంచములో లేని రోగాలన్ని నీ కూతురికే ఉన్నాయి. ఒకరోజు కడుపు నొప్పి ఒక రోజు నెత్తి నొప్పి ఒక రోజు గుండె దడ: లేని పోని తద్దినం కొని తెచ్చుకున్నాయి. హాయిగా పది రూపాయల దగ్గర పదిహేను పారేస్తే వంటమనిషి వచ్చేది.''

నగలు అలమరలో పెట్టి తాళం వేసుకున్నాడు. శశి ఓ మూల కూర్చున్నది.

“యేదో పొరపాటు జరిగింది. మా




మయ్యా! శశికి ఈ మధ్యే కొంచెము బాగా లేదు. నేను డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాను. పసిది దానికేం తెలుసు.'' మండుతున్నా మెత్తగా మాట్లాడినది.

“నాకామాత్రము తెలియదా? డాక్టరు దగ్గరకు వెళ్ళామంటే, మందులు పడవు అంటుంది. నాతో మాట్లాడటం, ఉండటం అంత అయిష్టమయినపుడు పెళ్ళి ఎందుకు చేసుకుందట అడుగు నేను పొలాల దగ్గరకు పోతున్నాను.

చేతి కర్ర వూపుకుంటూ వెళ్ళిపోయాడు.

“శశీ! ఏమిటేయిది? యిప్పటికే సగం చచ్చిపోయాను.''

“నేను పూర్తిగా చచ్చిపోయానమ్మా అతనంటే అసహ్యము, అతని చేష్టలు చూస్తే డోకు వస్తుంది. నన్నేం చెయమంటావమ్మా'' దీనంగా అడిగింది.

“నేనేం చెప్పాలి? అయిందేదో అయింది. అతడిని మంచి మాటలతో లొంగదీయి. తల్లీ మన రహస్యము బయట పడకూడదు. తియ్యని మాటలతో రాసి యిస్తానన్న ఆస్తి రాయించుకో. రేపు యే మాత్రము అనుమానము వచ్చినా చిల్లి గవ్వ దక్కదు. రెంటినిచెడ్డ రేవడివి కాకు.

“తల్లి బ్రతిమాలి రక, రకాలుగా నచ్చ చెప్పి వచ్చింది. ఆమె హృదయం కుమ్మరాములా కుములు తున్నది. యిం

ట్లోకి వచ్చి గ్లాసెడు మంచినీళ్ళు తాగి కూర్చుంది.

భయపడుతూ, భయపడుతూ సుశీల వచ్చింది. వెనుకాలే ఓ యువకుడున్నాడు. దుర్గమ్మ ఉరిమి చూచింది. సుశీల అక్కడే ఆగిపోయింది.

"యెందుకొచ్చావు? నా పరువు తీశావు. నా పిల్లల బ్రతుకులు నాశనం చేశావు. నన్ను రచ్చ కీడ్చావు. ఇంకా నీ పగ తీరలేదా? వెళ్ళు. నా కళ్ళముందు నుండి వెళ్లు. నిన్ను చంపి ముక్కలుగా నరికినా పాపంలేదు." దుర్గమ్మ అరుపులకు అందరూ హాల్లోకి వచ్చారు. ఉమాపతి భార్యవంక తీక్షణంగా చూశాడు.

"ఊఁ ఇంకా యెందుకు అరుపులు. అమ్మాయి క్షేమముగా తిరిగివచ్చింది. చాలు. రండి సుధీర్! సమయానికి అమ్మాయిని కాపాడినారు. థాంక్స్!"

"పెద్దవారు. అంత మాట అనకండి. మానవధర్మం నెరవేర్చాను, నాకు పని వుంది. మీ అమ్మాయిని మీకు అప్పగించాలని వచ్చాను," అన్నాడు. దుర్గమ్మ మాటలను లెక్కచేయలేదు. ఇల్లు విడిచిందన్న కోపంలో అలా అంటుందని సరి పెట్టుకున్నాడు.

"మా అమ్మాయి కాదు. మాకు అప్పగించవల్సిన పనిలేదు. యెప్పుడైతే అది ఇల్లు విడిచిందో అది అప్పుడే బజారు మనిషి అయింది. చూడండి. మీరు ప్రతి సారి దానికోసం నన్నూ, నా పిల్లలను అవమానపరుస్తే సహించాను. ఈసారి నన్ను కాదని దాన్ని ఇంట్లోకి రానిస్తే నా శవం కళ్ళ చూస్తారు. అడ్డమైన మగాళ్ళను వలలో వేసుకుని...."

'అత్తయ్యా, నన్ననండి. వారు పాపం దయతో నన్నింత దూరం తెచ్చారు."

"యెంత ధైర్యమే! నన్నే యెదిరిస్తున్నావు. వారట వారు. వారితోనే ఉండు" గొంతు చించుకుంది.

"మీ అత్త గుణం తెలియదా సుశీ! రా. క్షమించండి సుధీర్ గారూ!"

"ఫరవాలేదు. ఇక్కడ అమ్మాయి ఉన్నా మొదటి పరిస్థితులే యెదురవుతాయి. యేదయినా హాస్టల్లో ఉంచటం మంచిదండీ, సుశీలా! నీకు నాపై నమ్మక ముంటె రండి. మీకు ఏదో ఒక ఏర్పాటు చేస్తాను" సుధీర్ చివాలున వెనక్కు తిరిగాడు. ఒక్క నిమిషం ఆలోచించి సుశీల కూడా వెనుదిరిగింది.

"చూచారా! దాని నాటకం. అది నిజంగా ఉండాలని వచ్చిందా? మమ్మల్ని నిష్టూరంచేసి వెళ్దామని వచ్చింది" దుర్గమ్మ వెనకనుండి అరిచింది.

"అత్తయ్యా, మనుష్యుల్ని యిరకాటంలో పెట్టడం నీకు బాగా చాతనవును. ఒక్క విషయం మాత్రం మరచిపోకు, నువ్వున్నది నా తండ్రి యిల్లు. నువ్వు తింటున్నది నా నాన్న డబ్బు. నన్ను

అన్యాయం చేసినందుకు ఒకరోజు ఫలితం అనుభవిస్తావు. నీ యింట రాజభోగాలు అనుభవించలేదు. బయటకు వెళ్ళి కష్ట పడేది ఏమి లేదు. నీ యింట చేసిన చాకిరియే యింట చేసినా, నా కడుపు నిండుతుంది. నాకు వేయి వరాలు యిచ్చినా వుండను. యే అనాథఆశ్రమంలోనైనా వుంటాను."

"అనాథఆశ్రమముతో యెందుకే? అందం యెరగా పెట్టుకొని ఎక్కడైనా బ్రతుకు."

"అది నీ బిడ్డలకు నేర్పావు చాలు. చచ్చి స్వర్గానున్న మా అమ్మను అన్న దానికి ఫలితం కూడా అనుభవిస్తున్నావు. ఇంకా నీ గర్వం తగ్గలేదంటే విచారంగా వుంది." తిరస్కారముగా చూచి దుర్గమ్మ పెట్టే శాపనార్థాలను వినకుండానే బయటికి వచ్చింది. అనసూయ దగ్గరకు పోబోయింది. దారిలోనే కనిపించిన ప్యూన్ వారు ఎక్కడికో పెళ్ళికి వెళ్ళారని వారం రోజులవరకు రారని చెప్పారు. నిరాశగా వెళ్ళి సుధీర్ కారులో కూర్చున్నది. అతని కారు వెళ్ళి పట్టణానికి అవతల ఒక పెద్ద తోటదగ్గర ఆగింది. సుశీల దిగి అతని వెనకాలే తోటలో ఉన్న యింటిలోకి నడిచింది. ముసలి నౌకరు యెదురొచ్చి సుధీర్ చేతిలో వున్న బ్యాగు అందుకున్నాడు.

"మీరు యే విచారం లేకుండా విశ్రాంతి తీసుకోండి. మీ జీవనోపాధికి నేను ఏర్పాటు చేస్తాను. దావా! అమ్మాయిగార్కి వేడినీళ్ళు, భోజనంవగైరాలు చూడు. నేను పనిమీద వెళ్తున్నాను. అక్కడ దారిలో కొన్ని చీరలున్నాయి తీసుకోండి," అని చెప్పి, సుశీల జవాబుకైనా యెదురుచూడకుండా వెళ్ళిపోయాడు అతను వెళ్ళిపోయాక ఇల్లంతా చూచింది. పెద్ద హాలు, ఒకవైపు తెరలు కట్టి ఉన్నాయి. తెరచాటున భోజనాలబల్ల, బేసిన్, అందమైన గాజుతలుపులతో చేసిన అలమర, దాని కెదురుగా చిన్న రిఫ్రిజరేటర్ ఉన్నాయి. అలమరలో రక రకాల గాజుపాత్రలు తళతళ మెరుస్తున్నాయి. బల్ల కెదురుగా చిన్న వంటగది, యింకో వైపు స్నానాల గది, దానిని దాటి పోగానే మరుగుదొడ్డి ఉన్నాయి. హాలు మధ్యలో ఖరీదయిన సోఫా సెట్టుంది. ఒక మూలకు బుక్ షెల్ఫ్, దానిపైన రేడియో. రేడియో దగ్గర కెళ్ళింది. అటుప్రక్కనే గుమ్మము కనిపించింది. గుమ్మం దాటి గదిలో అడుగు పెట్టింది. పడక గది. గది మధ్య అందమైన రోజ్‌వుడ్ కాట్. దానిపై పరుపు, దిండ్లూ, గళ్ళదుప్పటి పరిచివుంది. ఒకవైపు బల్లపైన కాగితాలు, పెన్నూ ఉన్నాయి. మంచానికి రెండోవైపున చిన్న బల్ల, దానిపై అందమైన ల్యాంపు ఉన్నాయి. గోడకున్న షెల్ఫ్‌లో రకరకాల పుస్తకాలున్నాయ్. గోడకు అందమైన ప్రకృతి చిత్రాలున్నాయి. బయటి వరం




డాలో ఉన్న గది వుంది. అందులో పాత నులకమంచము, దండెముపై బట్టలు వున్నాయి. అది దాదా గది కావచ్చు ననుకుంది. బయట మొక్కలకేసి చూస్తూ నిల్చుంది.

''రా బెటియా! నీళ్ళు కాగాయి'' పొట్లం విప్పి చీర తీసుకుంది. కలకత్తా చేనేత చీర అందంగా వుంది. బ్లవుజు పీసులు బయట పడవేసి స్నానానికి బయలుదేరినది. తన జీవితములో మొదటిసారి కడుతున్నకొత్త చీర, ఎప్పుడూ అత్త పాతచీరలే కట్టేది. అతనెవరు? తనెవరు? ఏమిటీ అవినాభావ సంబంధము! అతని వివరాలు తెలుసుకోవాలని దాదా దగ్గర కెళ్ళింది. బంగాళా దుంపలు వేయిస్తున్నాడు.

''దాదా! ఈ అయ్య యెవరు నీకు తెలుసా?'' దాదా తిరిగి చూచినాడు. అతని చూపులు భక్తిభావంతో నిండుకున్నాయి. ''ఎవరని చెప్పనమ్మా! దీనులకు దిక్కు! అయినవారిచే అనాదరింపబడి జ్వరంతో ఒణుకుతున్న నన్ను తెచ్చి, మందు ఇప్పించాడు. బాగుపడి యెటుపోవాలో తెలియక యిక్కడే ఉన్నాను. ఆయనకు వండిపెట్టి మిగిలింది తింటాను. నన్ను ప్రేమగా చూస్తారు. ఇతర వివరాలు నేనుఅడగను. అతను చెప్పలేదు.''

మరేం మాట్లాడక వెళ్ళి స్నానం ముగించుకు వచ్చి భోజనం చేసింది. పడుకోవాలనిపించినా యెక్కడ పడుకోవాలో తెలియక సోఫాలో వాలిపోయింది. నిద్ర ముంచు కు వచ్చింది.

సుశీల మేలుకునేసరికి ప్రొద్దు పడమట వాలింది. దాదా నవ్వుతూ కాఫీ తెచ్చాడు. కాఫీ త్రాగుతూ బల్లమీద జాకెట్లను చూసి ఆశ్చర్యపోయింది. "ఇది యెప్పుడు కుట్టినారు?"

"నీవు నిద్రపోయావు. నే ప్రక్కనే ఉన్న దర్జీ దుకాణానికెళ్ళి కుట్టించుకు వచ్చాను."

"ఇంత తొందరగా కుట్టినారా?" ఆశ్చర్యంగా చూచింది.

"మరేమిటి? దర్జీవాడు జైలుకెళ్ళివచ్చి యెక్కడ పనిదొరకక ఏడుస్తుంటే అయ్యగారు మిషన్ కొనియిచ్చాడు. పాపం, పిల్లా పాపలతో బ్రతుకుతున్నాడు. వాడి పెద్ద కూతురు అచ్చు నీలాగే ఉంది. అదే అదితో కుట్టించాను." ఖాళీ కప్పు తీసుకుని వెళ్ళిపోయాడు. రాత్రికి భోజనంచేసి అతనికోసం పదకొండు గంటలవరకు చూచి సోఫాలోనే నిద్రపోయింది.

"దాదా! ఆమెను క్రొత్త మంచంమీద పడుకోమని చెప్పలేకపోయావు. దిండు కూడా లేదు" సుధీర్ గొంతువిని అదరిపడి లేచింది. తెలతెలవారుతుంది. అతను బట్టలు మార్చుకుంటున్నాడు. అతనివంక పరీక్షగా చూచినది. సామన ఛాయ, పొట్టి పొడవుకాని యెత్తు, బలిష్ఠమైన దేహం. చిన్నవే అయినా సూదంటురాయిలా వాడిగా కనిపించే కళ్ళు. కుడిచెంపపైన అడ్డుగా అంగుళంమేరకు గీసుకుపోయిన మచ్చ. ఆ మచ్చ వికారాన్ని కలుగజేయటం లేదు. ముఖానికి వింత అందాన్ని చేకూరుస్తున్నది. వత్తుగా, నల్లగా ఉన్న జుట్టు. అన్నీ కలిసి అతడి అందాన్ని సానపెట్టినట్టున్నాయి. "మీరు లేచారా! రాత్రంతా ఆ సోఫాలో యెలా నిద్రపోయారు. నాదే పొరపాటు. ఏర్పాటుచేసి ఉండాల్సింది. భోజనమైనా సరిగ్గా చేశారా లేదా?"

"లేదు. భోజనం చేశాను. నిద్రకూడా పోయాను" అన్నది మొహమాటపడుతూ.

"సరే, మీ కోసం ఒక ఉద్యోగం చూశాను. ఇష్టమైతే మధ్యాహ్నము వెళదాము."

"యెక్కడ? ఇష్టముగాక ఏమవుతుంది?" ఆత్రంగా అడిగినది.

"సికిందరాబాద్ అవతల ఆడపిల్లల గురుకులం ఉంది. అక్కడ బోధనా భాష హింది. వారికి తెలుగు బోధించుటకు ఉపాధ్యాయిని, హాస్టల్‌కు వార్డెను కూడా కావల్సి ఉంది. విద్యార్థులను మూడు తరగతులుగా విభజించినారు. పెద్దవారు అంతా పదిహేనునుండి యిరవై సంవత్సరములవారు. వారికి వార్డెన్ వుంది. యెటొచ్చి చిన్నపిల్లలకు లేదు. వాళ్ళంతా

పది సంవత్సరములవారే. వారిని అదుపులో పెట్టడం మీకు పెద్ద కష్టం కాదనే అనుకుంటాను.''

"చిన్నవారయితే పరవాలేదు." అన్నది తృప్తిగా.

''మీరు పిల్లలను అజమాయిషీ చేసినందుకు అన్నం ఉచితంగా పెడతారు తెలుగు బోధించినందులకు నెలకు అరవై రూపాయలు యిస్తారు. నాకు జీతం మరీ తక్కువనిపించింది. కానివ్వండి, యింకో చోట చూచాక అది వదిలివేయవచ్చును. అక్కడుంటే మీకు కొంత ధైర్యం చిక్కుతుంది. పదిమందిలో తిరిగే గడుసుదనం నేర్చుకుంటారు'' అని చిన్నగా నవ్వాడు సుశీల ముఖం దించుకుంది.

"నా చదువుకు అన్నం పెట్టి అంతకంటె యెక్కువ డబ్బు యెవరిస్తారు లెండి. అక్కడే ఉంటాను."

"మంచిది." అతను కాలకృత్యాలు తీర్చుకుని వచ్చాడు. సుశీల కూడా తయారయినని ఇద్దరూ దాదా పెట్టిన చపాతీలు తిన్నారు. ఓవల్టీన్ త్రాగి అతను నిద్రపోయాడు.

తోచక ఏదో మాగజైను పేజీలు తిరగవేస్తూ కూర్చుంది. రెండు బుట్టల నిండా కూరగాయలు తీసుకుని ఓ రైతు వచ్చాడు. దాదా కూరకాయలను చూచి, ''ఇన్ని యెందుకయ్యా? అయ్యగారికి యెన్ని కావాలి? అసలు నీకు డబ్బుమీద మోజు లేదా?'' అని అడిగాడు.

"నా యిల్లు నిలబెట్టిన దాతకు యిస్తే నా ధనం తరిగిపోతుందా? సమయానికి బకాయిడబ్బు కట్టకపోతే, ఈపాటికి ఇల్లూ పశువులు వేలం వేసేవారు. అతని కిచ్చి వెళ్ళితేనే తృప్తి. లేచినాక నా దండాలు చెప్పు." అతను వెళ్ళిపోయాడు.

ఒంటిగంటకు వంట కాగానే లేపాడు దాదా. అతను స్నానం చేసి వచ్చాడు. యిద్దరూ భోజనాలు చేశారు. అతను చిన్న తోలుపెట్టె యిచ్చాడు.

''యెందుకండీ?' మొహమాటపడింది.

"మీరు ఉద్యోగంలో చేరాక వడ్డీతో సహా తీర్చుకొందురుగాని." అతనుతెచ్చిన చీర తనది. అందులో సర్దుకుని. కార్లో బయలుదేరినారు. దారిలో నూనె. సబ్బులు టవల్స్. అద్దం, బొట్టు కొని యిచ్చాడు. నాల్గుగంటలకుగురుకులంచేరుకున్నదికారు.

(సశేషం)

---

''చూడండి.... నేను తీయబోయే చిత్రం యొక్క కథ కొత్త తరహాకి చెందినది. సంగీతం కూడా కొత్త తరహాలోనే వుండాలి. ఫొటోగ్రఫీలో కూడా మన సినిమాలో కొత్త తరహాలు....'' దీర్ఘంగా చెప్పుకుపోతున్న నిర్మాత డైరెక్టర్‌లో మార్పు చూసి, ''ఏమిటి ఆలోచిస్తున్నారు?'' యిదిగా ప్రశ్నించాడు.

డైరెక్టరు కాస్త బుర్ర గోక్కుంటూ. ''కలక్షన్లు కూడా కొత్త తరహాలు వుంటాయేమోనని....'' నసిగాడు.

—వెలిచేటి శ్రీనివాసరావు, కాకినాడ-1.

---

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్ వల్ల ఆరోగ్యము కలుగును





ఫోస్‌ఫోమిన్

- శక్తిని పెంపొందించును,
- ఆకలిని అధికము చేయును,
- సహన శక్తిని హెచ్చించును,
- శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.






ఫోస్‌ఫోమిన్...
ఆకుపచ్చని పండ్ల రుచిగల
విటమిన్ టానిక్

SQUIBB® TTT®
SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్. ఇన్కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం: దీని లైసెన్సుడు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

Shilpi HPMA-36A/70 1

# మాఫ్ కర్

అడివి శివసుబ్రహ్మణ్యం

గదిలో సన్నగా వెలుగుతోంది, బెడ్ రూం లైట్.

బయట సన్నగా పన్నీరు లాంటి వానజల్లు.

ఆ గుమ్మిద వర్షానికి తలదాచుకున్న ఓచ్చగాడి మూలుగు!

నిద్రరావటం లేదు.

కబుర్లు చెప్పుకోవటానికికూడా ఎవరూ లేరు. మా రూం మేట్ ఊరు వెడుతూ నన్ను ఆ రూంలో ప్రవేశ పెట్టి వెళ్ళాడు. నేను ఆ రూమ్‌లో చేరి, దాదాపుగా పది రోజులైంది. ఇంకా క్రొత్తదనం పోలేదు.

అప్పటివాకా చూచివచ్చిన హిందీ సినిమాలోని సంఘటనలు ఒక్కొక్కటే జ్ఞాపకం వస్తున్నాయి. ఆ సినిమా మొదట తెలుగులో తీసినదే, దానినే కొన్ని మార్పులతో చేర్పులతో హిందీలో తీశారు. రెండుకుటుంబాల మధ్యనున్న కలహాన్ని అంతరింప చెయ్యాలనే తలంపుతో భర్తతో తన బిడ్డను అనాధ అని చెప్పి మరొకరి బిడ్డను తన బిడ్డగా పెంచుకుంటుంది. తన కళ్ళముందే తన బిడ్డ పశువుల పాకలో పెరుగుతూ. పాలేరులా పొలంపనులు చేస్తూవుండటం-అన్నీ ఆమె మనస్సును చిత్రవధ చేస్తున్నా, ఆమె తన అభిప్రాయాన్ని మార్చుకోదు రహస్యాన్ని తన మనస్సులోనే దాచుకుని కుమిలిపోతుంటుంది. చక్కని నటన! సినిమా సుఖాంతం! బాగుంది. మొత్తానికి చూడదగిన చిత్రం.

ఎవరో తలుపు తట్టినట్లైంది.

నాకు నమ్మకంలేదు తలెత్తి చూచాను.

మరొకసారి తలుపు చప్పుడు!

ఈ సారి లేచి, లైటువేసి. తలుపు తీశాను:

ఒక పొడవాటి సన్నని వ్యక్తి లోనికి వచ్చి తలుపు దగ్గరగా వేశాడు. చినుకులు పడుతూనే ఉన్నాయి. బయట.

నేను ఆశ్చర్యంగా అతడి వైపు చూచాను.

"మీ పేరు సుబ్బారావు. కదూ" ఇంగ్లీషులో మాట్లాడాడు, ఆ వచ్చిన వ్యక్తి.

"అవును"... అన్నాను

"నాపేరు గొకాడ్. నన్ను డేవిడ్‌కర్ గారు పంపించారు" అన్నాడు.

"అంటే రైల్వే టిక్కట్ కలక్టర్ గారు.... మధ్యలోనే ఆపేశాను సందేహంగా.

"వాళ్ళమ్మాయి విజయకు మూడురోజుల నుంచి జ్వరం నిన్నటి నుంచి మన స్పృహలో లేదు. మిమల్నే కలవరిస్తోంది. ఒకసారి మిమ్మల్ని తీసుకురమ్మన్నారు.

బయట టాక్సీ వుంది'' అన్నాడతడు.

విజయ నన్ను కలవరించటం ఏమిటి? నేను ఆ రూంలోకి వచ్చిన తరువాత, ఒకటి రెండు సార్లు ఆమె నాకు గుర్తుకు వచ్చింది. అంతే!

ఆలోచించకండి ప్లీజ్, బయలుదేరండి డాక్టరుగారు కూడా మిమ్మల్ని తీసుకొని రమ్మనిచెప్పారు. ఆయోమయంగా పెట్టిన నా ముఖం చూచి మరొకసారి జ్ఞాపకం చేశాడతను.

నేనింకా ఆలోచించలేక పోయాను. నైట్ పైజమానైనా మార్చుకుండా పదండి అన్నాను.

ఆయన వెనకనే రూంకు తాళంవేసి, నేనూ బయలు దేరాము. బయట సిద్ధంగా వున్న టాక్సీ ఎక్కాను. అతడితో పాటుగా.

కారుతో సమానమైన వేగంతో పయనిస్తోంది నా మస్తిష్కం.

నాకు డిఫెన్సు ఆకౌంట్స్ వారి ఆఫీసులో ఉద్యోగం లభించిన కారణంగా రెండేళ్ళ క్రితం పూనా వచ్చాను. అప్పటికి, మా బాబాయిగారు పూనాలోనే వున్నారు.

నా చిన్నతనంలో హిందీ మేష్టరుగా వున్న మా మామ్మయ్య బలవంతం వల్ల నేర్చుకున్న హిందీ, పూనాలో నా కెంతో సహకరించింది. పూనా మహారాష్ట్రంలో వున్న మరాఠీ భాషకు దరిదాపులలో నున్న హిందీ భాష రానివారు చాలా తక్కువ మంది వుంటారు. చాకలి, మంగలి, పచారీ షాపు వగైరా, అన్ని చోట్ల నాకు వచ్చిన హిందీ బాగా సహకరించేది?

పూనాలో మా బాబాయిగా రుంటున్న ఇంటికి ఎదురుగా నున్న ఇంటిలో దేవిడే కర్ అనే మరాఠీ ఆయన వుండేవాడు. రైల్వేలో టికెట్ కలక్టర్‌గా పనిచేస్తున్నాడు. ఆయనకు ఇద్దరు కూతుళ్ళు పెద్ద అమ్మాయి పేరు కిశోరి ఆమె బి. ఎ. చదువుతోంది. రెండో అమ్మాయి విజయ. ఆమెకు ఐదేళ్ళు వుండగా నాకు తెలుసు. మూడు మాసాల క్రిందట మా బాబాయి గారికి ఇక్కడ నుంచి సికిందిరాబాదు ట్రాన్సఫరుఅయి వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళిపోయిన తరువాత. నాకు విజయతో పరిచయం అధికమైంది. హోటలుభోజనం నా శరీరానికి సరిపడని కారణంగా మా బాబాయిగారు వెళ్ళిన తరువాత, నేను స్వయంగా వంట చేసుకొనేవాడిని.

ఉదయాన్నేలేచి, స్నానంచేసి, కూరలు తెచ్చుకోవటానికి వెళ్ళేవాడిని. మా ఇంటికి దాదాపు ఫర్లాంగు దూరంలో వున్న మా ర్కెట్టుకు. అదే సమయానికి పాలవాడు వచ్చేవాడు. అందుకని నేను పాల గిన్నె విజయకు ఇచ్చి! పాలు పుచ్చుకో మని చెప్పి వెళే వాడిని నేను కూరలు తీసుకుని రాగానే ఓ మదరాసి! అని పిలిచేది. నన్ను విజయ.



1953 సంవత్సరానికి పూర్వం ఆంధ్ర రాష్ట్రం! మదరాసు రాష్ట్రంలో కలసి వుండి నప్పటికీ ప్రస్తుతం ఆంధ్ర దేశం ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడిందని ఇక్కడ ప్రజలలో చాలా మందికి తెలియదు. కనుక ఆంధ్రులను కూడా మదరాసీలుగానే భావిం చేవారు ఇప్పటికీ చాలామంది వున్నారు ఇక్కడ.

నేను వెళ్ళి పాల గిన్నె తీసుకొని వచ్చేవాడిని.

'నేను మదరాసీని కాదు—ఆంధ్రుణ్ని' అని చెప్పేవాడిని నేను.

"నువ్వు మదరాసీ వాడివని మానాన్న గారు చెప్పారు" అని విజయ సమా ధానం.

చలాకీగా మాట్లాడుతూ చురుకుగా వుండే విజయని చూస్తే, నాకు ఆనందంగా వుండేది.

ఒక రోజు నన్ను "మదరాసీ"—అని పిలవటం, వాళ్ళ నాన్నగారువిని విజయను మందలించారు.

"ఆయితే ఏమని పిలవాలి?" అంది విజయ.

"మామా—అని పిలు" అనిచెప్పారు

వాళ్ళ నాన్నగారు.

అప్పటినుంచీ! నన్ను "మదరాసీ" అని పిలవటం మానేసి! "మామా" అని పిలవటం మొదలు పెట్టింది.

నేను వంట చేసుకుంటుంటే, నా దగ్గరకు వచ్చి కూర్చుని కబుర్లు చెప్పేది రోజూ అప్పుడప్పుడు నాకు చపాతీలు చేసి పెట్టేది. వాళ్ళ ఇంట్లో ఏ పిండివంట చేసినా నాకు తెచ్చిపెట్టేది.

విజయ ఉదయం, సాయంకాలం నా దగ్గర కూర్చుని కబుర్లు చెప్తుంటే వాళ్ళ నాన్నగారు. వచ్చి "మా అమ్మాయి మిమ్మల్నిడిస్టర్బు చేస్తున్నట్లుంది. పాపం" అనే నారు.

"అలాంటిదేమీ లేదండీ — ఏవో కబుర్లు చెప్తుంది. నాకూ కాలక్షేపంగా వుంటోంది" అని చెప్పాను ఆయన నవ్వి వెళ్ళిపోయారు.

నేను ఏదైనా సినిమాకు వెడితే తరచుగా విజయను కూడా తీసుకొని వెళ్ళేవాడిని. విజయ చిన్నపిల్ల అయినప్పటికీ —నాతో సినిమాకు వస్తే మా ప్రక్క ఇళ్ళవాళ్ళు ఆశ్చర్యంగా చూచేవారు. వాళ్ళ నాన్నగారు మాత్రం "ఏదో చిన్నపిల్ల — మీ దగ్గర అలవాటయింది. మీకేమైనా ఇబ్బంది కలుగుతే మాత్రం చెప్పండి" అనేవారు.

నేను భోజనం చేస్తుంటే, నా ప్రక్కన కూర్చుని విజయ. కబుర్లు చెప్తున్నపుడు "విజ్జు" అని పిలిచేది. వాళ్ళ అక్కయ్య, మా గుమ్మం ముందు నిలబడి.

విజయ నేను లేనని చెప్పు! అని నాకు సంజ్ఞచేసి తలుపు చాటున దాక్కొనేది. వాళ్ళక్కయ్య మరి రెండు సార్లు పిలిచాక "భౌంయ్" మంటూ బయటికి వచ్చి భయపెట్టేది. వాళ్ళక్కయ్యను.

"ఇంటికి నడు—అమ్మ అన్నం పెట్టి, నీ కోసం చూస్తోంది" అని వాళ్ళక్కయ్య ఇంటికి తీసుకొని వెళ్ళేది.

నేను వారం రోజుల పాటు మా వూరుకు వెళ్ళి వస్తే "బుద్దూ—ఎక్కడకెళ్ళేవ్ — నీ కోసం దాచి పెట్టాను ఇవి మా అమ్మ మొన్న చేసింది" అంటూ! రెండు లడ్డు వుండలు తెచ్చి నాకు ఇచ్చింది.

నాగ పంచమి ముందు రోజు రాత్రి మా రూంకు వచ్చింది. ఎడం చేతినిండా గోరింటాకు పెట్టుకుంది. ఒక చెంచాతో మరి కొంత తెచ్చి ఇదిగో చెయిందిచెయ్యి పట్టు—నీకు పెడతాను" అంది.

ఊహుం.నాకు వద్దు నేను నీలాగా ఆడపిల్లను కాను అన్నాను పరిహాసంగా.

'నువ్వు మగాడివే లేవోయ్ బుద్దూ! నేను పెడతా పెట్టించుకో అంది మళ్ళీ.

నేను గోరింటాకు పెట్టించుకోలేదు.

విజయ వెళ్ళిపోయింది.

తలుపు దగ్గరవేసి పడుకున్నాను.

ఉదయం వచ్చి నన్ను నిద్ర లేపింది విజయ.

"ఏయ్ బుద్ధూ! చెయ్యి చూసుకో" అంది.

నా చేతిలో గోరింటాకు.

కోపంవచ్చి కొట్టటానికి చెయ్యెత్తాను.

తుర్రున పారిపోయింది. విజయ కిల కిలా నవ్వుతూ.

ఒకరోజు వుదయం నేను వంటచేసు కుంటుంటే వచ్చి కూర్చుంది. "ఇవాళ్ళ మా యింటిలో పేరంటం అంది.

"ఎందుకూ" అని అడిగాను.

"ఎందుకేమిటి శ్రావణమాసం కదూ!" అంది.

"ఓహో" అన్నాను.

"నేను సాయంకాలం చీర కట్టు కుంటాను."

"అలాగా!" అన్నాను. చారులో తిరగ మూత పెడుతూ'

బుద్దూ వింటున్నావా? నేను సాయం కాలం చీర కట్టుకుంటాను అంది మళ్ళీ.

"మరి నాకు చూపిస్తావా?" అని అడిగాను.

"మరి —?" సాయంకాలం పెంద రాళే వచ్చేసెయ్యి ఆఫీసునుంచి "అంది"

"అలగే" అన్నాను.

"అల్లాగే కాదు-తప్పకుండా రావాలి."

"ఓ—తప్పకుండాను" అని చెప్పాను

ఆ సాయంకాలం విజయకు చెప్పిన ట్లుగానే! అరగంట ముందుగా ఆఫీసునుంచి వచ్చాను.

నేను గదితాళం తీస్తుంటే చూపింది కాటోలు—నేను కాళ్ళుకడుక్కుని బట్టలు మార్చుకునే సరికి, విజయ వచ్చింది.

చీర కట్టుకుంది—లేత పిలంరంగు నైలాన్ చీర ఆకు పచ్చరంగు క్రేపు సిల్కు జాకెట్టు —ఎంతోనిండుగా చూడ ముచ్చటగా వుంది.

"ఇదిగో చీర. చూడు—బాగుందా?" అని అడిగింది.

"బ్రహ్మాండంగా వుంది — నిన్ను చూస్తుంటే నాకు నిన్నే పెళ్ళిచేసుకోవాలని పిస్తోంది." అన్నాను. నవ్వుతూ.

"ఆడపిల్లలంతా గోరింటాకు పెట్టుకుం టారు. నువ్వూ పెట్టుకున్నావుగా నిన్నెవరు పెళ్ళి చేసుకుంటారు?" కిలకిలా నవ్వింది విజయ

"ఓహో! అయితే నేనే ఓడిపోయాను" అన్నాను. బుర్రగోకుంటూ.

"అలారా దారికి! ఇవాళ్ళ పేరంటా ళ్ళందరికీ కాఫీ ఇస్తున్నాం, మా ఇంట్లో" అంది.

"మరి నాకో?" అన్నాను

"మరచిపోయాను. నువ్వు ఆడపిల్లవే లేదూ: తెస్తానుండు" నా మాట వినిపించు కుండా ఇంటికి పరిగెత్తింది.

అయిదు నిమిషాలలో కాఫీతో తిరిగి వచ్చింది.

నేను కాఫీతాగేశాక నా చొక్కానిండా సెంటు రాసింది, వద్దంటున్నా వినిపించు కోకుండా.

## ఒకే ఉతుకులో 3 దశలుగా పనిచేసి...




## డెట్ బట్టలను ఎక్కువ తెల్లగా ఉతుకుతుంది

—ఏ యితర పౌడరు కంటె

### ఎలా చేస్తుందో ఎందుకు చేస్తుందో చూడండి:

**1వ. దశ :** డెట్‌లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము బట్టలోనికి త్వరగా చొచ్చుకొనిపోయి, బాగా అంటుకొని ఉన్న మట్టిని కూడ సడలిస్తుంది—బట్టలు శుభ్రపడతాయి.

**2వ. దశ :** డెట్ మట్టిని వదలించిన తరువాత దానిని బట్టకు మళ్లీ అంటుకోకుండా చేస్తుంది—దుస్తులు శుభ్రపడతాయి. శుభ్రముగా ఉంటాయి.

**3వ. దశ :** డెట్ బట్టలకు అదనపు తెల్లదనమును కలిగిస్తుంది—బట్టలు పూర్వము కంటె ఎక్కువ తెల్లగా ఉంటాయి! (నీలి లేక తెలుపు చేసే పదార్థమును చేర్చనక్కర్లేదు).

**డెట్ను నేడే కొనండి!** స్వస్తిక్ ఆయిల్ మిల్స్, బొంబాయి

SHILPI HPMA 38A/70 TEL

"మా పేరంటాలందరికి వసుపుకూడా పూస్తాం మరి, నీకు పూయనా? అంది.

"వద్దులే బాబూ! ఈ మర్యాద చాలు" అన్నాను.

"ఇంకా పేరంటాలు ఇంట్లో వున్నారు. వస్తా" అంటు లేడిపిల్లలా పరుగు తీసింది.

సుమారు. పదిహేను రోజుల క్రిందట ఒక స్నేహితుడి దగ్గర నుంచి 'బుల్ బుల్ తెచ్చాను. నాకు చేతనైనంత వరకు వాయించి కొన్ని పాటలు వినిపించాను విజయకు.

'నేను గూడా వాయించి చూస్తాను" అంది.

"వద్దు. ఇది నాది గాదు. నా మిత్రుడిది" అని చెప్పాను.

అదే సమయానికి మరొక మిత్రుడొస్తే వీధిలోకి వెళ్ళి ఐదు నిముషాలు మాట్లాడి వచ్చాను. నేను తిరిగివచ్చి చూసేసరికి బుల్ బుల్‌కు వున్న మూడు తీగలలోనూ ఒక తీగ తెగివుంది.

"ఎందుకు తెగింది?" అన్నాను కోపంగా.

"వాయిస్తుంటే తెగిపోయింది," అంది విజయ జాలిగా ముఖం పెట్టి.

"వాయించవద్దని చెప్పానుగా."

"పోనీలే. నేనొక తీగను కొనిస్తాను" అంది విజయ.

గర్వంతో కూడిన ఆ సమాధానం




వచ్చేసరికి నాకు మరింత కోపం వచ్చింది.

"అసలు నీకు చనువియ్యటం నాదే తప్పు. ఈసారి గదిలో ఏ వస్తువూ ముట్టుకోకు' అన్నాను. అంత కఠినంగా ఎలా మాట్లాడానో!

విజయకు కూడా కోపం వచ్చినట్లుంది.

అక్కడనుంచి లేచి ఇంటికెళ్ళిపో

యాంది.

ఆ మరునాడు నేను ఆఫీసునుంచి వచ్చి తలుపు తీసి, ఆ రోజు వచ్చిన వుత్తరం తీసుకున్నాను. ఆ ప్రక్కనే వున్న 'బుల్ బుల్' తీగ చూసాను. అకారణంగా విజయను బాధపెట్టానే అనిపించింది. విజయ చేసిన పని తప్పే అయినా, అంత చిన్న విషయానికి అంత కఠినంగా మాట్లాడి వుండకూడదనుకున్నాను.

ఆ తరువాత ఆ యింట్లో వున్నది వారం రోజులే! ఆ వారంరోజులలో విజయ నన్ను చూసి ముఖం ప్రక్కకు తిప్పేసుకునేది.

మా మిత్రు డొకడు తనతోపాటుగా వుండమంటే, అతడి రూం ఆఫీసుకు దగ్గరలో వున్న కారణంగా అతడి రూంలో ప్రవేశించాను. ఇంకా పది రోజులు కాలేదు.

ఈ గతం అంతా గుర్తుచేసుకునేసరికి విజయపట్ల కఠినంగా ప్రవర్తించినందుకు నా మీద నాకే కోపం వచ్చింది.

టాక్సీ నడుస్తూనే వుంది. దూరంగా ప్రసూతిహాస్పిటల్ కనుపిస్తోంది. మరొక పది నిముషాల్లో రాస్తాపేటలోని విజయ ఇంటికి చేరుకోగలిగాను. పది నిమిషాలు నా మనస్సుకు పది యుగాలుగా గడిచాయి.

రాస్తాపేట వచ్చింది. మూడురోడ్లమధ్య వున్న ఆంజనేయ స్వామివారి ఆలయం - కొంచెం ముందుకు పోయాక, సదరన్ మీల్సు హోటల్ ఇంకా ముందుకు వెళ్లాక ఒక మలుపు - మలుపు తిరిగి కొంచెం దూరం నడచి, టాక్సీ ఆగిపోయింది. చేతినున్న వాచీ చూసుకొన్నాను.పన్నెండు గంటలైంది. ఇంట్లో దీపాలు వెలుగుతున్నాయి.

దగ్గరనే వేసియున్న తలుపు త్రోసుకుని లోపలికి వెళ్ళాను. మంచంమీద పడుకునుంది విజయ. ఆ ప్రక్కనే కుర్చీమీద వాళ్ళ నాన్న, కొంచం దూరంలో వాళ్ళ అమ్మ, వాళ్ళక్కయ్య మరొక మంచం మీద కూర్చున్నారు. వాళ్ళమ్మ చీరచెంగుతో కళ్లు తుడుచుకుంటోంది.

నన్ను చూడగానే వాళ్ళ నాన్నగారు లేచి "నమస్తే! వచ్చారా? కూర్చోండి" అని కుర్చీ చూపించారు.

"అమ్మాయి, విజ్జా! మామ వచ్చాడమ్మా మద్రాస్ మామ, చూడు" అన్నారు, లోతుకు పోయిన కళ్ళు, పీరసించిపోయిన శరీరం. ఆ పరిస్థితిలో విజయను చూస్తే నా కళ్ళు చెమ్మగిల్లాయి.

విజయ నెమ్మదిగా కళ్ళు తెరచింది. తలత్రిప్పి నా వైపు చూచింది "నేను వచ్చానమ్మా విజయా అన్నాను.

విశాలమైన విజయ కళ్ళు ఒక క్షణం మెరిశాయి. కేకలేసి కూర్చోపెట్టాను.

విజయ ఒక్కసారి చూచింది నా వైపు.

"నాకేం కోపం లేదమ్మా. నీ మీద" అన్నాను. విజయ తల మీద నా చేతిని వుంచి ఓదార్పుగా.

విజయ కన్నీటితో "మామా—మాఫ్ కరో" అంటూ నా వడిలో వాలి పోయింది.

# అన్నయ్య అనురాగం

"సునీత"

సునీలా! సింహగర్జనలా వినిపించింది ఆ పిలుపు ఆ పిలుపు నాలుగు గదులు దాటి సునీల గదిలో, కిటికీ దగ్గర కూర్చున్న సునీల చెవులను తాకి, ఆశ్చర్యపరచింది మధురాతి మధురంగా నున్న ఆ గొంతుకలో ఆప్యాయత కురిపించునట్టి తన తండ్రి పిలుపేనా? అది.

"సునీలా! మరో సారి భయంకరంగా హాలు దద్దరిల్లునట్లుగా వినిపించింది. సునీల గభాలున గుమ్మంలోనికి వెళ్ళింది. అపటికే తన తండ్రి చేతిలో యేదో కాగితం పట్టుకుంటూ కళ్ళలో నిప్పులు కురిపిస్తూ కనిపించేరు.

"ఏం నాన్నగారూ! కంగారుగా అడిగింది సునీల"

ఏమిటిది? ఎన్నాళ్ళనుంచి ఈ పన్నాగం చెప్పు?"

తండ్రి చేతిలోని ఉత్తరం చూసి త్రుళ్ళిపడింది. కాలేజీ నుంచి వచ్చి అశ్రద్ధగా పుస్తకాలు విసిరేసింది. అందులో తనకు రాజేష్ వ్రాసిన పుత్తరం వున్న సంగతి మర్చిపోయింది.

అవును నాన్నా! ఇది నిజమే మీకు తెలియకుండా ఈ పని చేస్తునందుకు క్షమించండి. రాజేష్ చాలా పుత్తముడు నాన్నా నేను మనస్పూర్తిగా ప్రేమించాను పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాం. మీతో చెబుదామనుకుంటుండగా.... మీరే.,

ఏం? కూశావు రామనాధంగారు చెయ్యి ఆవేశంతో పైకెత్తి ఆ చెంప ఈ చెంప చెళ్ళుమనిపించాడు. కోపంతో ఆవేశంతో వూగిపోతుండగ.

శంకరం హాలులోకి వచ్చి ఏమిటి నాన్నా? ఏం? జరిగింది. ఏమైందసలు. అన్నాడు. తండ్రి ఆవేశాన్ని, చెల్లెలు బిక్కమొహాన్ని" చూస్తూ.

ఏం జరిగిందా? ఏం జరిగిందో దాన్నే అడుగు. ఇది నా కడుపున చెడబుట్టిందిరా నా ఈ వంశాన్ని నా ప్రతిష్టను నాశనము చేస్తున్న నీ చెల్లెలు ఘనకార్యం రా యిది. ఎవడో శూద్రపు కులంవాడని నన్ను బ్రాహ్మణ కులాన్ని గంగపాలు చేస్తుందిరా ఇది నా కూతురు కాదు. ఇది మహా...... అంటూ మళ్ళీ చెయ్యి ఎత్తబోయాడు.

ఏమిటి నాన్న మీరు ఆడపిల్లపై చేయి చేసుకోవటం అంటూ తండ్రీ, కూతుళ్ళ మధ్యగా నిలబడి, చెల్లెల్ని తన వీపు వైపు నెట్టాడు.

ఇది ఆడపిల్ల కాదురా. ఆడ రాక్షసి. ఆవేశంతో ఒగరుస్తూ కళ్ళలో నిప్పులు కురిపిస్తున్నాడు రామనాథం పంతులు.

"నాన్నా మీరు పెద్దవాళ్ళు ఆవేశపడ కండి నిదానంగా ఆలోచించే విషయాలు యివి. పెద్దగా అరవడం వలన మనకే నష్టం తర్వాత మాట్లాడుకుందాం కాస్త విశ్రాంతి తీసుకోండి మీరు" అంటూ అక్కడున్న కుర్చీపై బలవంతంగా కూర్చోపెట్టేడు. వంటగదిలోనికి వెళ్ళి చూస్తే తల్లి మతిపోయిన దానిలా చూస్తూ కూర్చుంది.

చెల్లెలు గదిలోకి వెళ్ళి చూడగా సునీల వెక్కి వెక్కి ఏడుస్తూ కూర్చుంది. బుద్ధి తెలిసిన తరువాత ఏ నాడు తండ్రి చేతిలో దెబ్బలు తినని తన చెల్లెలు అతి గారాబంగా పెరిగిన సునీల బుగ్గలు అచ్చు తేరేలా వున్న దెబ్బలను చూసిన వెంటనే అతని కళ్ళలో నీళ్ళు తిరిగేయి. అవి కనిపించ కుండా తుడుచుకొని, దగ్గరకు వెళ్ళి "సునీ" అని పిల్చేడు నెమ్మదిగా. వెక్కి వెక్కి ఏడుస్తున్న సునీల వెనకతిరిగి చూపి అతని కళ్ళలో పొంగి వస్తున్న కన్నీటిని చూస్తూ అన్నయ్యా, నా కోసం ఏడుస్తున్నావా? నిజము? అన్నయ్యా అంటూ మళ్ళీ అతని గుండెలో తల దాచుకొంటూ ఏడుస్తూ కూర్చుంది.

"సునీ ఏమిటిది? నువ్వలా ఏడుస్తూ కూర్చుంటే ఎలా? నీ బాధ ఏమిటో ఎలా తెలుస్తుంది. నువ్వు చెపకపోతే ఎలా తెలుస్తుంది చెప్పులే. నిదానంగా కూర్చుని జరిగిందేమిటో చెప్పు."

"అవునన్నయా నేను రాజేష్‌ని ప్రేమిస్తున్నాను. మనస్ఫూర్తిగా ప్రేమించి ఆరాధిస్తున్నాను. రాజేష్ చాలా వుత్తముడన్నయ్యా అతని ప్రేమ, అనురాగం, అప్యాయత పొందిన నేను జన్మ జన్మలకు ఋణపడివుంటాను. నేను తెలివి తక్కువగా, యవ్వన అహంకారం, తొందరపాటులో ప్రవర్తించ లేదన్నయ్యా నాకున్న ఆత్మ విశ్వాసంతోటి, ఆత్మ స్థయిర్యంతోటి నేను ధైర్యంగా ఎదుర్కోగలను. ప్రేమ చాలా పవిత్రమైందన్నయ్యా ప్రేమించి ప్రేమింప బడటం ఒక నేరమా! నేను చేస్తున్న పని తప్పా? చెప్పన్నయా?"

'తప్పు కాదమ్మా ఇది నవలలు సినిమాలు కాదమ్మా! జీవితం! దేముడిచ్చిన వరం. మన దారికి అడ్డువచ్చిన ముళ్ళనీ ఎదుర్కొని పూలబాటగా తీర్చి దిద్దుకోవాలి. తొందరపాటు అనాలోచన పనికిరాదు. నీ భవిష్యత్తును దృష్టిలో వుంచుకుని వివేకంతో ఆలోచించి ఒక నిశ్చయానికి రా," అంటూ ముందుకు వెళ్ళబోయాడు శంకరం.

"అన్నయా,! రాజేష్‌తో నా జీవితం ఏనాడో ముడిపడిపోయింది అతను లేకుండా బ్రతకడం కష్టం. నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చానన్నయ్యా!"

అయితే సరే! వస్తానంటూ ముందుకు వెళ్ళాడు శంకరం.

* * *

సుశీల అతి మామూలుగా తయారయి సంధ్యవేళ లోపల దీపం వెలిగించి, ఎదురుగా వున్న చిన్ని కష్ణునకు నమిస్కరిస్తూ 'దీపం, జ్యోతి, పరబ్రహ్మం, దీపం సర్వం సంధ్యాదీపం నమస్తుతే' అని రెండు చేతులూ జోడించి మనస్సులో ధ్యానించింది.చిన్ని కృష్ణుడు చిరునవ్వుతో చూస్తూ వుంటే తనూ చిరునవ్వు నవ్వింది.

మెల్లగా అడుగులేసుకుంటూ గేటు తెరచుకొని పరిసరాలను చుట్టూ మనసారా చూచుకొని ధైర్యంగా ముందుకు అడుగులేసింది. మనసులో ఆలోచనలు ఈగల్లా ముసురుకున్నాయి ....

అద్దంలో చూసి తల దువ్వుకుంటున్న రాజేష్ వెనకనుండి చిరునవ్వుతో స్వచ్ఛమైన తెల్లని పుష్పంవలె విచ్చుకున్న ఆ ముగ్ధ మనోహరిని చూసి ఆశ్చర్యబోయాడు. వెనక్కి తిరుగుతూ 'అరె! సుసీ! నీవా? ఎప్పుడూ నా రూంకు రాని దానివి ఈ వేళలో ఏమిటిలా దయచేశావ్?' ఆశ్చర్యంతో కనుబొమలు దగ్గర చేస్తూ అడిగాడు.

'రాజూ! నీ రూమ్‌కే కాదు, నీ జీవితంలోనికే పూర్తిగా వచ్చేశాను.' అంటూ చిరునవ్వుతో అతని ప్రక్కన కూర్చుంది, అర్థం కానట్లు చూశాడు రాజేష్. జరిగింది అంతా చెప్పి, అన్ని బంధాలు, అన్ని మమకారాలు, అనురాగాలు త్రెంచుకొని ధైర్యంగా నీ దగ్గరకి వచ్చేసాను రాజూ!' అంటూన్నప్పుడు ఆమె పెదివులు కంపించాయ్. ఆఖరు మాటలు అంటున్నప్పుడు నొక్కి-నొక్కి ఏడుస్తూ అతన్ని అల్లుకుపోయింది.

'సుసీ! మంచి పని చేశావ్, మళ్ళీ ఈ ఏడుపెందుకు? అంత ధైర్యసాహసములతో చేసినదానివి మళ్ళీ ఈ బేలతనం ఎందుకు? ఛి....ఛి....వూరుకో' అంటూ ధారగా కారుతున్న కన్నీటిని తుడిచి ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు.

రెండురోజులనంతరం నిజ జీవితంలో భార్యాభర్త లయ్యారు కుమారి సునీత శ్రీమతి సునీతగా మారిపోయింది. వెళ్ళిపోయే రోజున శంకరంను స్టేషన్‌కు రమ్మనమని ఫోన్ చేసింది. స్టేషన్‌లో అన్నయ్యకోసం ఎదురుచూస్తుండగా వచ్చాడు శంకరం. రాజేష్ దగ్గరగా వెళ్ళి అతని చేతులను తన చేతిలోకి తీసుకొని 'రాజూ! సునీత చిన్న వయసుది. తెలిసీ తెలియని వయస్సు. అది తెలియక చేసిన తప్పయినా, తెలిసి చేసిన తప్పయినా కోపగించినప్పుడు సరిదిద్దాల్సిన బాధ్యత నీది. ఇంతకంటే నీకు నేను చెప్పాల్సింది లేదు' అంటూ ఆప్యాయంగా భుజం నొక్కాడు. చెల్లెలు మొహంలో గమనిం

చిన భయాందోళనలు గమనించిన శంకరం 'సుశీ! ఈసారి నేను వచ్చేటప్పుడు మేనల్లుడుండాలియేం?' అన్నాడునవ్వుతూ.

సుశీల వెంటనే రాజేష్ ముఖంలోకి చూసి అంతలోనే ఓరునవ్వుతో తలవాల్చేసింది. దూరంగా వినిపిస్తున్న రైలుకూత విని శంకరం 'వస్తాను. పని వుంది' అని గబగబా స్టేషన్‌దాటి వెళ్ళిపోయాడు.

* * *

కాలచక్రం గిర్రున తిరిగిపోతుంది. రెండేళ్ళ తరవాత శంకరం సంసారం చేస్తున్న సమయంలో తల్లి కొడుకు దగ్గర కూర్చొని 'శంకరం! సుశీల బాగుందటరా! సుఖంగా వుందా అసలు? సుశీలకేం తెలియదురా పాపం. వుత్త అమాయకురాలు నా తల్లి ఎలా వుందో? ఎక్కడున్నా దేవుని దయవలన సుఖంగావుంటే చాలు.'

'అమ్మా! నీ కూతురు నువ్వనుకున్నంత అమాయకురాలు కాదమ్మా! అది చాల తెలివైనది. అది ఏ పని చేసినా సంపూర్ణ విశ్వాసంతో చేస్తుందమ్మా! బావని ఎంత ఆడిపించి ఏడిపిస్తుందో. నువ్వనవసరంగా బాధపడకమ్మా! సుశీల ఎక్కడున్నా సుఖంగా సంతోసంగా వుంటుందమ్మా!' అంటూ తల్లికి ధైర్యవచనాలు చెప్పి అక్కడకుండి లేచి వెళ్ళిపోయాడు.

కాలం మాన్పని గాయం లేదంటారు. మెల్లమెల్లగా రామనాథంగారికి కుతురిపట్ల ఏర్పడిన కోపం, పట్టుదల బదులుగా జాలి సానుభూతి రోజురోజుకీ పెరిగిపోయాయి.

శంకరం ఆఫీసులో ఫైళ్ళలో తల దూర్చి సీరియస్‌గా ఆలోచిస్తుండగా పోస్ట్ అన్న కేక విని లేచివెళ్ళి వుత్తరం అందుకున్నాడు. ఎవరబ్బా అని కవరు త్రిప్పి చూశాడు. సుశీల దగ్గరనుండి. వెంటనే విప్పి చదవాడు——

ప్రియమైన అన్నయ్యకు!

సుశీల నమస్కరించి వ్రాయునది. అన్నయ్యా! నా మీద నీకు చాలా కోపం

వచ్చిందిగదూ నేను ఇంతవరకు ఉత్తరం వ్రాయలేదని? ఏం చేసు నన్నయ్యా !పరిస్థితుల ప్రభావంవలన ఇలా జరిగింది, క్షమిస్తావుకదూ!

అన్నయ్యా! ఇక్కడనుండి ధైర్యంగానే వెళ్ళాము. అత్తగారూ, ఆడపడుచులు ఆప్యాయంగా అదరిస్తారని నమ్మిన నేను వాళ్ళ ప్రవర్తనకు చాలా ఆశ్చర్యపోయాను. కొన్నికొన్ని సంఘటనలు వివరంగా రాస్తాను. చదువు— మొట్టమొదట వాళ్ళ ఆచారాలు సంస్కృతి, వాళ్ళ పద్ధతులు అలవాటు చేసుకోవడం కష్టమనిపించింది. రానురాను అలవాటైంది, అత్తగారికి నన్ను ఒక వింత మనిషి చూస్తున్నట్టు చూస్తుంటే బాధ పడ్డాను. ఆడపడుచులు చేస్తున్న హేళనలకు తట్టుకోలేక బలవంతంగా వస్తున్న దుఃఖాన్ని తమాయించుకున్నాను. ఈ లోకం, ఈ సంఘం సూటిపోటి మాటలకు, వాళ్ల చూపే దయ, సానుభూతికి మనస్సులో సూదుల్లా గుచ్చుకునేవి. వాళ్ళ మాటలు.

ఒకసారి ఆయన స్నేహితునితో మాట్లాడుతూంటే -

'ఏం చేస్తాం పిన్నీ! ఆడపిల్ల అలా బరితెగించి మగాళ్ళతో సరసాలాడుతూ మాట్లాడటం ఎరుగుదుమా! ఎంత చదువుకున్న అమ్మాయి అయితేమాత్రం మా అమ్మాయిలు లేరూ! వాళ్ళ వినయ విధేయతలు, అణకువ దీని కెక్కడనుండి వస్తుంది? అయినా మన కులంలో వున్న రీతి, సాంప్రదాయం దీని కెలా వస్తుంది? వుత్త పిచ్చి సన్యాసి కాబట్టి దీని వలలో పడి మా ఆశలు గంగపాలు చేశాడు. ఇదంతా మా ఖర్మ ఏం చేస్తాం పిన్నీ?'

వంటింట్లోంచి వినవస్తున్న ఈ మాటలు విని గుండెల్లో పొంగికొస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేకపోయాను. గదిలోనికి వెళ్ళి వెక్కి ఏడవసాగాను. ఇంతలో ఆయన దగ్గరగా వచ్చి 'సునీ! ఏమిటది? దీనికే ఇలా బెంబేలు పడిపోతే ఇకముందు ఎలా నెగ్గుకొస్తావు? నువ్వు నాతో వస్తున్నప్పుడు ఏమన్నావు. ఒక్కసారి ఆలోచించు.'

'మీరు నా ప్రక్కన వుంటే ఎంత సాహసాన్నైనా చేయగలను. ఎన్ని అవాంతరాలు వచ్చినా ఎదుర్కోగలను. మీరు నా అండగా నిలిచివుంటే ఎంతటి కష్టాలైనా అవలీలగా భరిస్తాను' అని మాట యివ్వలేదూ అని నన్ను ఓదార్చి ముందున్న కర్తవ్యాన్ని బోధించారు.

ఇంకొకసారి, మా చిన్న ఆడబడుచు తన స్నేహితులకు నన్ను పరిచయం చేసింది. ఇంచుమించు నా వయస్సే వున్న వారిని చూచి చాలా ఆనందపడ్డాను, సరదాగా ఇట్టే వారితో కలిసిపోవాలనిపించింది. దూరంగా వున్న వారి సంభాషణలు విని అవాక్కయిపోయాను.

'సరోజా! మీ అన్నయ్యది లవ్ మేరేజా?'

'ఆఁ....ఈ అమ్మాయిగారి అందంలో పడి మా అన్నయ్య బుద్ధి గడ్డి తిన్నది.'

'అయితే, మీ కులం కాదా?'

'ఛ....ఛ....మా కులం కాదు. అసలు ఆ అమ్మాయి తల్లిదండ్రులకు కూడా తెలియదు. తనే ధైర్యంచేసి అన్నయ్య తో వచ్చేసింది.'

'అంటే....పారిపోయా!'

'కాకపోతే....ఈ ప్రబుద్ధుడు సన్మానించి వూరేగిస్తారా ఏం! జిడ్డు మొహమా' అంటూ పకపక నవ్వుతూ స్నేహితులతో వెళ్ళిపోయింది. నాతో ఆప్యాయత కురిపిస్తూ మాట్లాడుతున్న సరోజ నా వెనుకగా ఇలా మాట్లాడిందంటే నమ్మలేక పోయాను.

మరొకసారి వంటింట్లోకి వచ్చిన నేను అక్కడ మసాలా వాసనలకు కడుపు త్రిప్పుతున్నా నిగ్రహించుకుంటూ బలవంతంగా అత్తయ్య దగ్గరకు వెళ్ళి, 'అత్తయ్యా! ఈ వంటలు ఎలా వండాలో కాస్త నేర్పించండి. నేర్చుకుంటా నన్నాను అత్తగారు బుగ్గన వేలేసుకుంటూ 'అయ్యోరామ.... ఈ గర మసాలావాసనలకు కడుపు త్రిప్పి వాంతులు చేసుకునే మీరు ఈ వంటలు వండగలరటే!' సాగదీస్తూ అంది.

'పరవాలేదత్తయ్యా: అలవాటు చేసుకుంటే అదే అలవాటవుతుంది. కొత్తలో కష్టమైనా రానురాను అలవాటవుతుంది' అన్నాను నెమ్మదిగా తలదించుకుంటూ.

ఒకసారి ఆయనగదిలో సామ్రాజ్యాలు కోల్పోయిన మహారాణిలా విచారంగా పరధ్యానంతో ఆలోచిస్తున్న నేను అత్త గారి కేకతో వులిక్కిపడ్డాను 'సునీ! పద భోంచేద్దాం. అమ్మ పిలుస్తుంది. రోజు రోజుకి ఇలా డల్‌గా తయారవుతున్నావేం?' అంటూ బలవంతంగా భోజనాల గది దగ్గరకు నడిపించుకు వెళ్ళారు.

ఆయన ప్రక్కన కూర్చుని భోజనం చేస్తున్న నేను ఆ కూరను, ఆ వంటలకు అలవాటుపడని నేను బలవంతంగా తినడం, అది సాధ్యం కాకపోవడం చూసి వారు ఫక్కున నవ్వారు. అర్థంకానట్లు చూశాను వారివైపు.

'సునీ! అసహ్యం వేస్తుందికదూ? అందుకే కష్టం. హోటల్‌లో ఏదైనా తెచ్చిపెడతానుండు' అన్నారు లేఎబోతూ. వారిని కూర్చోబెట్టి ఏం వద్దులెండి. మొదట్లో అసహ్యం వేసినా మెల్లగా అలవాటు చేసుకుంటాను.' అన్నాను బలవంతంగా. అప్పటికే నా కళ్ళలో నీరు తిరుగుతుంది. వారికి కనబడకుండా విశ్వప్రయత్నం చేసాను.

'సునీ! ఎందుకు నీకీ కష్టం. నా నుండి ఎందుకీ పాట్లు?'

'మీ కోసం' అన్నాను కన్నీళ్ళ నిండిన కళ్ళలో, చిరునవ్వు చిందిస్తూ.

నా నవ్వు, ఏడుపు చూసి పకపక నవ్వారు.

అన్నయ్యా! వారు ప్రక్కన వుంటే, ఎంత కష్టానైనా యిట్టే మరిచిపోతాను. వారు నాకు అన్ని విధాలా తగినవారు. నాకు తెలియని వారి ఆచారవిధానా లెన్నో తెలుపుతూ ప్రతి విషయాన్ని బోధపరుస్తూ, నా అంతగా నిలచి నన్ను నవ్విస్తూ,




నవ్వుతూ వున్న ఆయన స్వభావాన్ని చూసి గర్వపడని రోజులేదు.

అన్నయ్యా! ఈ జీవితంలో అడుగడుగునా ముళ్ళు అడ్డుపడుతున్నా, ముళ్ళను చీల్చుకుంటూ ఈ జీవితాన్ని, నా ఆత్మవిశ్వాసంతోను, ఆత్మస్థైర్యంతోను ఆయన సాహచర్యంలోను పూలబాటగా తీర్చిదిద్దుకుంటాను. ఇది నిజం అన్నయ్యా! ముమ్మాటికి ఇది నిజం. ప్రేమ పవిత్రమైనది. దానిని నేను నమ్ముతాను. ఇప్పుడిప్పుడే పరిస్థితులు చక్కబడుతున్నాయి. అత్తగారు, పడుచులు నన్ను నన్నుగా గావించి ఆదరిస్తున్నారు. ఎలాగైనా అత్తగారిని నన్ను మెచ్చుకునే విధంగా చేస్తాను. ఈపాటికి అమ్మ, నాన్న కూడా కోపం తగ్గిందనుకుంటాను. నేను ఎక్కడున్నా సంతోషంగా వున్నానని చెప్పన్నయ్యా! త్వరలోనే నీకు మేనల్లుడిని అందివ్వబోతున్నాను. ఈ శుభవార్త వదినకు చెప్పు. తప్పులుంటే క్షమించు. నేను ఎప్పుడూ సంతోషంగా ఉండాలని ఆశీర్వదించు అన్నయ్యా! ఇంక వుంటాను.

జన్మజన్మలకు నీ చెల్లెలుగా పుట్టాలని
భగవంతుని ప్రార్థిస్తున్న
నీ చెల్లెలు
సునీల.'

శంకరం ఆనందంతో వుత్తరం మడిచి జేబులో పెట్టుకొని, సెలవుచీటి పడేసి పరుగులాంటి నడతో యింటికి వచ్చాడు. గుమ్మంలో బుజ్జిగాడిని చూసి, వుత్సాహంతో వాడిని పైకి ఎగరేసి వాడు కేరింతాలు కొడుతూవుంటే శంకరం ఆనందంతో నవ్వుతున్నాడు.

'ఏమండీ! వాడినలా ఎగరేయకండీ! మంచిదికాదు' అంది శంకరం సంతోషం అర్థంగాక.

అయినా లక్ష్యపెట్టక మరీ మరీ పైకి ఎగరేస్తూంటే బుజ్జిగాడికి ఏం అర్థంగాకపోయినా బోసినోటితో చిరునవ్వులు మాత్రం వెలిగిస్తున్నాడు. •

# చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !




ఫలితములను చూడండి, బట్టలను ఆఖరు సారి జాడించునపుడు కొంచెము టినోపాల్ వేయండి, అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయ్యే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు దాల్పికి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తోంది.




® టినోపాల్ జె.ఆర్. గైగి ఎస్.ఎ, బాల్ స్విట్జర్లెండ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగి లిమిటెడ్.
పి.ఒ. బాక్స్ 11050, బొంబాయి 20 బి.ఆర్.

Shilpi HPMA 12A/70 Tel



# సృష్టిలో అతి కష్టమైనది

అజ్జరపు హనుమంతరావు

ఆఫీసు టైమయింది .... సైకిలు మలుపు తిప్పానో, లేదో, భుక్తా యాసంతో రొప్పుతూ రాఘవరావు కనిపించాడు ....

"గురూ....విన్నావా!!" అన్నాడు. ఆత్రంగా...."ఏమిటి?" అన్నా, సైకిలు దిగి,

"స్వరాజ్యంవచ్చిందట...!"అన్నాడు, రహస్యం చెప్పినట్టువెంటనే. మర్మగర్భిత మైన నవ్వు....ఆ గారపట్టిన పళ్లుచూస్తే నాకు పరమ అసహ్యం.

"ఓహో...."అంటూనే సైకిలు ఎక్కేశాను. మధ్యాహ్నం యింటర్వెల్ సమయంలో యింటి కొచ్చినపుడు, "యిది విన్నావురా ఒబ్బాయ్?!" అంది మాఅమ్మ ఆశ్చర్యంగా-కాఫీకప్పు అందించి.

"ఏమిటది?" అన్నా కాఫీ సిప్ చేస్తూ. "స్వరాజ్యం వచ్చిందట....!!" అంది కళ్ళు పెద్దవిచేసి. చప్పిదవళ్ళు మరింత దగ్గరగా నొక్కుకుంటూ....

"వస్తేవచ్చిందిలే...." విసుగ్గా బయటికి కొచ్చేశాను. ఆఫీసులో పడితే మరేవిషయం ఆలోచించడానికి తీరికుండదు. నా సీటటువంటిది....

"యిహ నావల్ల కాదు బాబూ యీ చాకిరీ....కోడలుపిల్ల కొంప దిద్దుకుంటూ వుంటే హాయిగా రామా-కృష్ణాఅంటూ మూల కూర్చోవలసిన యీ వయసులో వండడం-వార్చడం....ఇహ ఆ రాత నాకు లేదు.... అర్ధరాత్రివేళ, అపరాత్రివేళ చకచకమంటూ లేచి తిరగడానికి నేనేం పిల్లముండని కనకనా!! ఏగడపో, కొయ్యో తగిలి తిరగబడి మూలబడితే యింత ముద్దపడేసే దిక్కులేదుకొంపలో...."

అంటూ.... యిది రోజూనాకుమామూలె! నేనింకా పెళ్లిచేసుకోలేదనే కాని నిజంగారిలీఫ్ కోసం కాదావిడ తాపత్రయం!

"నేను పెట్టుకుతింటాలేవే' నువ్వు పడుకో...." నామామూలు డైలాగ్సు నేనూ అప్పజెప్పాను.

"సరేలే....పెట్టుకు తింటావ్ట.... అయినా నా ఏడుపు నాదే కాని నీకేంతెక్కలే...." అంటూ మౌనంగావంటింట్లోకి నడిచింది మాఅమ్మ....

ఆవేశంలో మొదట ఏదో మాట్లాడేసినా రెండు క్షణాల్లోనే శాంతం సంతరించుకొంటుంది. "ఒరేయ్! అన్నట్టు తొమ్మిదో నెల కూడాను! ....అయినా దాన్నెవడే ఏసుకుంటాళ్లే! అప్పుడే అనుకున్నాం"

కోపంగా చెయ్యి కడిగేసుకొని లేచిపోయాను, "అయ్యో .... అదేంట్రా?!! ఎందుకూ అంత కోపం" యింకా ఏవో అంటోంది మా అమ్మ.... అదేం వినిపించుకోకుండా నా రూములో కొచ్చి మంచంమీద పడ్డాను....

ఎంతగింజుకున్నా నిద్ర రావటంలేదు మనస్సు స్వరాజ్యంపయిపే దౌడు తీస్తోంది.... కళ్లెం వేయడం యిహ నా తరం కాలేదు! స్వరాజ్యం....!!

ఒకప్పుడు నన్ను గాఢంగా ప్రేమించింది,. జాలిపడి చేరదియ్యాలనుకుంది.... ఆ తర్వాత పూర్తిగా అసహ్యించుకుంది ....

నేనుమాత్రం ఎప్పుడూ నిర్లిప్తంగానే ఉండిపోయాను....

మా నాన్నంటే నాకు చచ్చే భయం! లేకపోతే- పెళ్ళిడుపచ్చినపిల్ల 'నిన్ను ...నాను' పెళ్ళి చేసుకుంటాను.... అని దగ్గరగా వస్తే మౌనంగా వు...., నీరుగారిపోయే చవటెవడేనా వుంటాడా?? నేను ప్రయత్నం చేశాను. కాని మానాన్న నన్ను పూర్తిగా డామినేట్ చేసి పారేశాడు.. "నీకేం సిగ్గులేదూ? దాన్ని పెళ్ళాడ్డవేంట్రా?? చెప్పినట్టు వింటే విను. లేకపోతే బయటికినడు...." అన్నాడు, కచ్చితంగా- ఒక్కగానొక్క నలుసునన్న కన్సెషన్ కూడాచూపించకుండా. అంతే!! నానోరిక పెగల్లేదు. మా నాన్న పోయి, నాపెద్దరికం వచ్చేసరికి స్వరాజ్యానికి పెళ్ళయి పోయింది....

మూడేళ్ళ గడిచి నామనసు మనువు వేపు మొగ్గటం లేదు....స్వగతం స్వరాజ్యాన్ని మర్చిపోలేదు....ఎలా మర్చిపోతాను? రోజు కొకసారైనా మాఅమ్మే జ్ఞాపకం చేస్తూ వుంటే?!!

"పాపిష్టిది! బిడ్డ కేంమందుపెట్టిందో... పెళ్ళంటేనే పెడమొహం పెడుతున్నాడు...." అని స్వరాజ్యం నాకేదో మందు పెట్టిందని మా అమ్మ నమ్మకం.

అసలామాటకొస్తే నాకు స్వరాజ్యానికి పెళ్ళి కాక పోవడానికి కారణం పూర్తిగా స్వరాజ్యమే నంటాను!! చక్కనిది, చదువుకున్నది, ఆస్థి పరు రాలు అయినప్పిల్లని ఎవడు మాత్రం కోడలుగా వద్దంటాడు? మానాన్న అన్నాడంటే ఒక విధంగా రైటే! మానాన్నంటే భయం కొద్దీ అంటున్నాననుకునేరు! (ఆయనిప్పుడెలాగూలేడని మీకు తెలుసుగా!!) లేక ... ఒక హద్దు-పద్దుఉండాలి! స్వరాజ్యానికి రెండూ లేవు!! ఎదుకంటే వాళ్ళమ్మ చిన్నప్పుడే చచ్చిపోయింది. వాళ్ళ నాన్న, ముసలి మేనత్తగారాబంగా పెంచేశారు....

నా కంటె కొన్ని నెలలు చిన్నదేమో స్వరాజ్యం. మా యింటి పక్కల్లే వాళ్ళది. నాతోబాటే మొగపిల్లల వీధి బళ్ళోచదువుకునేది....ఎక్కువగా మొగ పిల్లలతోనే ఆడుకునేదికూడా!! నాకుచెడుగుడు ఆటంటే చెడ్డభయం! స్వరాజ్యం బ్రహ్మాండంగా ఆడుతుంటే కళ్ళు పెద్దవిచేసి చూస్తూండే వాణ్ణి! నా కాడ్డంరాదని వేళాకోళం చేసేది. నేను చిన్నబుచ్చుకునేసరికి మళ్ళా తనే జాలిపడి క్షమాపణ చెప్పుకుని, ఊరడించేది. అసలు స్వరాజ్యం లేకపోతే ఇప్పటికి నాకు సైకిలు తొక్కడం వచ్చి వుండేని కాదేమో!! తను నాకంటే ముందే నేర్చుకుందన్న పౌరుషం కొద్దీ నేనూ నేర్చుకున్నాను. అప్పట్లో స్వరాజ్యాన్ని అందరూ గడుగ్గాయి-దుడుకుపిల్ల - మొగరాయడు అంటూండేవారు. గౌనులు దగ్గర్నుంచి, పరికిణీ—చొక్కా సైతం మా యింట్లోనే 'అత్తయ్యా—అత్తయ్యా' అంటూ మా అమ్మ వెనకాతలే తిరిగేది.

మా అమ్మ కూడా 'ఏవేఁ కోతలు పిల్లా' అని నాకు వరస కట్టేసి. నేను సిగ్గు పడి ముడుచుకు పోతే నా బుగ్గగిల్లి పారి పోయేది స్వరాజ్యం.

స్వరాజ్యం పైటలు ప్రారంభించింది. [illegible] కట్టింది. కాని చీకటి పడేవేళ కి యింటికి రావడం నేర్చుకోలేదు.

నాతో బాటే బియ్యేలో కొచ్చింది.... అయితే బాయ్ ఫ్రెండ్సు కూడా ఎక్కువయ్యారు.

అన్నట్టు స్వరాజ్యం యింట ర్లోనే మా యింటికి రావటం మానేసింది....మా అమ్మే మానిపించేసింది. తనని అత్తయ్యా అని పిలవద్దని కూడా కచ్చితంగా చెప్పేసింది మా అమ్మ. రహస్యంగా నేను వాళ్ళింటికి వెళ్ళే వాణ్ని. వాళ్ళకి, మాకు మధ్య వున్న ప్రహారీగోడ ఎత్తు చేయించే వాడు మా నాన్న. అయినా డాబా మీద నుంచే మాట్లాడేది నాతో....నేను రహస్యంగా మాట్లాడినా తను మాత్రం గట్టిగానే మాట్లాడేది. మా వాళ్ళంటే తనకేం భయం?....స్వరాజ్యంతో చాలా సినిమాల కెళ్ళే వాడ్ని నేను....అసలు వచ్చిన చిక్కెక్కడంటే నాతోనే కాదు, చాలా మంది మగవాళ్ళతో సినిమాలకి, షికార్ల కి వెళ్ళేది, స్వరాజ్యం! చాలా మంది యింటి కొచ్చేవాళ్ళు వాళ్ళతో గంటలు తరబడి నవ్వుతూ మాట్లాడేది!

బియ్యే కంప్లీటయ్యేసరికి 'పచ్చి తిరుగుబోతు' అన్న కాంప్లిమెంటు కూడా సంపాదించింది స్వరాజ్యం!....భార్య పోయిన తర్వాత వ్యాపారం తప్ప మరొక వ్యాపకం పెట్టుకోని స్వరాజ్యం నాన్న స్వరాజ్యానికి పూ ర్తి స్వరాజ్యం [illegible] సంతోషం కాక్షించాడే తప్ప మరే ఇతర ఆంక్షలు పెట్టలేదు. కూతురి గురించి ఎన్నో విన్నా మిన్నకుండి పోయాడు. స్వరాజ్యం మాత్రం 'ఏడిశారు' ఎవరేమనుకుంటే నాకేం?' అనేది. మేనత్త ఎప్పుడేనా మందలిస్తే మందహాసం చేసి ఊరుకునేది.

నాకు వేరే సంబంధాలు రావడం మొదలెట్టాయి.

ఒక రోజు స్వరాజ్యం అంది, నాతో.

"రాజూ....నీకు సంబంధాలొస్తున్నాయని విన్నాను."

అవునని తలూపాను

ఆవేళ మేమిద్దరమే వున్నాం—ఆమె గదిలో.

"మరి నన్ను చేసుకోవా?" కొంటెగా చూస్తూ అంది.

నేను సిగ్గుపడి పోయాను.

"ఏయ్! అంత సిగ్గెందుకు? మరి మనిద్దరం ప్రేమించుకుంటున్నాంగా...." అంది మూతి ఆదోలా పెట్టి.

"అవును....కాని మా అమ్మకి,నాన్నకి యిష్టం లేదు." అన్నా నెమ్మదిగా.

"ఆ సంగతి .నాకూ తెలుసు! కాని నాక్కావలసింది నీ ఉద్దేశం."




"నా కిష్టమే!....కాని...."

"కానీ....?" రెట్టించి, అడిగింది స్వరాజ్యం కాస్త సీరియస్‌గానే.

నాకు భయం వేసింది. కాని జవాబు చెప్పాలి లేకపోతే తిడుతుంది.

"నిన్ను చేసుకుంటే మా నాన్న యింట్లోంచి పొమ్మన్నాడు....అస్థిలో చిల్లి గవ్వ యివ్వనన్నాడు."

'మహరాజులా వచ్చెయ్! ఆస్తికేం? అంతకు పదిరెట్లు నా దగ్గరుందిగా...."

"అయితే నన్ను కొంటా వన్న మాట...."

"ఓయ్....ఓయ్! నీలో పౌరుషం వచ్చిందే!!....అద్యరే! యింతకూ మీ వాళ్ళ కెందు కిష్టం లేదుట?"

"నిజంగా నీకు తెలీదా?"

"నీ నోటి మీదుగా విందామని...."

'నలుగురూ నీ గురించి చెడ్డగా చెప్పు కుంటున్నారు. అందుకని...."

"ఏమని చెప్పుకుంటున్నారు?"

నేను మాట్లాడ లేదు.

"మాట్లాడవేం?" గట్టిగా అరిచింది స్వరాజ్యం.

అదరి పడ్డాను. శరీరం చెమటపట్టింది. గుండెలు దడదడ లాడేయి.

"అదే!! నువ్వు నలుగురితోటి విచ్చల విడిగాతిరుగుతావని.... యింకా....యింకా చాలా చాలా...." నెమ్మదిగా నసిగాను.

విపరీతమైన కోపంతో ఆమె ముఖం ఎరు పెక్కింది....కాని తమా యించు కుంది.

"ఐసీ!....నాతో తిరిగిన వాళ్ళలో నువ్వు కూడా వున్నా వుగా! నీకూ నాకూ తప్పుడు సంబంధం ఏదయినా వుందా?"

"ఛీ ఛీ...."

"ఛి ఛీ కాదోయ్ నాగమ్మా! ఉందా అని?"

"లేదు "

"మరింకెవరికైనా నాతో వుందని నీ అభిప్రాయమా?"

"లేదు "

"అలాగని మనస్ఫూర్తిగా నమ్ము తున్నావా?"

"ఆఁ?"

"చిన్నప్పట్నుంచీ నా స్వభావం నీకు పూర్తిగా తెలుసు! నా దారి స్వచ్ఛ మయింది అన్న నమ్మకం నాకున్నప్పుడు నేనెవర్నీ లెక్కచెయ్యననీ నీకు తెలుసు! అవునా?"

"అవును "

"చిన్నప్పట్నుంచీ నిన్నే ప్రేమిస్తున్నా నన్న విషయం తెలుసా?"

"కచ్చితంగా తెలియదు "

"పోనీ యివాళ నేను చెప్తే నమ్ము తావా?"

మాట్లాడలేదు నేను

బోనులో నుంచున్న ముద్దాయిలా వుంది నా పరిస్థితి!!

"ఏం? నమ్ముతావా?"

"నమ్ముతాను "

"కాని పెళ్ళాడలేవు. అవునా?"

"నాకు కొంత వ్యవధి కావాలి స్వరాజ్యం ఆలోచించుకోవి . ."

"అనవసరం! నువ్వేమీ ఆలోచించ క్కర లేదు .. వెళ్ళిరా ఊఁ క్విక్ "

చెమట తుడుచుకుంటూ బయటపడ్డాను. ఆ తర్వాత మా నాన్న దగ్గర మళ్ళీ స్వరాజ్యం సంగతెత్తి మోహం వాచేలా తిట్లు తిన్నాను.

స్వరాజ్యానికి కనిపించకుండా ముఖం తప్పించేశాను .. ఎటు తిరిగి స్వరాజ్యం మీదికే నా కోపం మళ్ళేది. అప్పుడేమిటి? యిప్పటికీని!! అందరు ఆడపిల్లలాగే తనూ ఎందుకుండ కూడదు? అణకువగా నమ్రతగా అచ్చం ఆడపిల్లలా . ఊహూఁ!! తన స్వభావం మార్చుకోదుట ఎవరూ అపార్థం చేసుకో కూడదుట!! .

ఒక్క విషయం మాత్రం నిజం! స్వరాజ్యం ఎంత స్వతంత్రంగా తిరిగినా చస్తే కాలుజారే మనిషి మాత్రం కాదు. ఒకసారి యిలతలింటి మా క్లాస్‌మేటు గారపళ్ళ రాఘవరావుగాడు ఏదో అన్నాడు స్వరాజ్యాన్ని- అంతే! పళ్ళూడేలా గొట్టింది వాణ్ణి. అసలు స్వరాజ్యాన్ని గురించి చెడుగా ప్రాపగాండా చేసిందికూడ వాడే! వీధిలోవాళ్లు సరేసరి. అదుగో పులి అంటే ఇదగో తోక అనే రకాలు.' ఇవన్నీ అపోహలు. 'మీరంతా తప్పు అభిప్రాయం పడుతున్నారు' అని నలుగురికీ, ముఖ్యంగా మా నాన్నకి చెప్పే ధైర్యం నాకు లేదు. అలాగని తెగించి తనని పెళ్ళాడే దమ్మూ లేదు....

మా నాన్న పోయి, నాకా ధైర్యం, తెగింపు వచ్చేసరికి పరిస్థితి చెయ్యిజారి పోయింది

స్వరాజ్యానికి పెళ్ళయిపోయింది!!!

అత్తారింటికి వెళ్ళిపోయేటప్పుడు నా క్కుబురంపింది. వెళ్ళాను ...

"రాజూ! నే మళ్ళీ తిరిగొచ్చేసరికి నిజమైన మొగాడిలా నా ముందు నిలబడాలి, తెలిసిందా?" అంది నవ్వుతూ.

నేనేం మాట్లాడకుండా వచ్చేశాను.

అలా మూడేళ్ళక్రితం వెళ్ళిపోయిన మనిషి యిప్పుడే రావడం.

తొమ్మిదో నెలట ,

పురిటికొచ్చింది, యిందాక మా అమ్మ అన్నట్టు మొగుడు

ఛ ఛ! అలా జరిగుండదు. జరక్కూడదు. గారపళ్ళ రాఘవరావు గూడా మధ్య ఏవేవో పేలాడు. స్వరాజ్యం మొగుడికి ఏం ఆకాశరామన్న ఉత్తరాలు రాశాడో!?

ఆలోచిస్తూ ఏ అర్ధరాత్రికో నాకు తెలియకుండానే నిద్రలో కొరిగాను.

మర్నాడాదివారం.

లేచేసరికి బాగా పొద్దెక్కింది.

తొమ్మిది గంటలయింది

స్నానం చేసి బజారుకని సైకిలు తీశాను. పెడలు మీద కాలుపెట్టి చూడకూడదనుకుంటూనే అప్రయత్నంగా పక్కింటి కిటికీ వయిపు చూశాను.

కిటికీ దగ్గర స్వరాజ్యం!!!

"మాట " అంది మామూలుగా

సైకిలు స్టాండువేసి అటువయిపు నడిచాను. తలుపు తీసి.

"మా నాన్నగారు-ఎక్కడికోవెళ్ళారు, మా అత్త ఊళ్ళో లేదు నేనొక్కర్తినే వున్నాను. రావడానికేమైనా అభ్యంతరమా." అంది అదోలా నవ్వుతూ,

'మౌనంగా లోపలికినడిచాను.

కుర్చీలో కూర్చున్నాను.

"యిప్పుడే వస్తా కూచో " అంటూ లోపలి కెళ్ళింది స్వరాజ్యం

ఆమె వయిపే చూస్తూ కూర్చున్నాను,

బాగా లావయింది స్వరాజ్యం,అందులో నిండు చూలాలు! మనిషి యిదివరకే తెలుపు యిప్పుడు మరింత తెల్లబడి, మెరిసిపోతోంది ఇంకోలా చెప్పాలంటే యిదివరకటి కంటె చాలా అందంగా ఉంటప్పుడు. నా కంటె ఎంతో పెద్దవయిపోయినట్టనిపించింది.

"ఏమిటోయ్! అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు! నా గురించేనా?" కాఫీ కప్పుతో ప్రవేశిస్తూ నా ఆలోచనలకి బ్రేక్ వేసింది స్వరాజ్యం.

'అబ్బే అదేం లేదు చాలా మారిపోయారే మీరు "పెద్ద తలుపుగోడలా అన్నా నా మాటల్లో నాకే సహజత్వం కనిపించ లేదు

నా సంబోధనకి విస్తుపోయిందిస్వరాజ్యం పక పకా నవ్వి.

"నన్ను మన్నిస్తున్నావా చిట్టి తండ్రీ, ఓహో!! మరొకరి భార్యననా??

నీకా భయం అక్కరలేదులే! ప్రస్తుతం నేను మామూలు మునపటిస్వరాజ్యాన్నే."

"అంటే?" అయోమయంగా అన్నాను

"అంటే— మా ఆయనకి నాకు యిక ఏ విధమైన సంబంధములేదు. విడాకు లిచ్చేశాను ." నవ్వుతూ అంది—ఎంతో సహజంగా.

నా తల తిరిగి పోయింది

"ఎందుకని?" అన్నా సీరియస్‌గా.

"ఆ మాత్రం వూహించ లేవూ? మన వీధి వాళ్ళ మహత్వం! మా ఆయనకి ఆకాశరామన్న ఉత్తరాలు రాశారు. ఆఅను మానవ్వుషి యీ మూడేళ్ళు నన్ను వేపుకు తిన్నాడు. భరించలేక విడాకులిచ్చేసి వచ్చేశాను " నేననుకున్నదే నిజం! ఒక్క నిట్టూర్పు విడవడం మినహా నేనేమీ మాట్లాడ లేదు. మళ్లీ తనే లంది.

"నా మాటకేంగాని, పెళ్ళి చేసుకోనని మొరాయిస్తున్నావుట ఏవిటి కథ " మామూలు ధోరణిలో అంది, వేళాకోళంగా.

"నీ కెవరు చెప్పారు?" ఎదురు ప్రశ్న వేశాను.

"ఇంకెవరు? నీ ఫ్రెండు! గారపళ్ళ రఘపరావుగాడు."

"నిన్నువాడెప్పుడు కలుసుకన్నాడు?"

"అబ్బో వాడి కథ చాలాబావుందిలే! ర్వాత జెబుతాను. అన్నట్టు పొద్దున్నే కలపు పూటా ఎక్కడికి బయలుదేరావు?" అంది. మాట మారుస్తూ.

"బజారుకి" ముక్తసరిగా అన్నాను.

"సరే! వెళ్ళిరా నీతో ఒకసారి మాట్లాడాలనిపించి పిలిచాను అంతే" అంది, ఇక చాలు వెళ్ళమన్నట్టు.మౌనంగా బయటికి నడిచాను.

* * *

నెల్లాళ్ళ కాంపు వెళ్ళి అవేళే తిరిగి వచ్చాను. పదిహేను రోజులక్రితం స్వరాజ్యానికి పురుడు రావటం! అదపిల్ల పుట్టి పోవడం కూడా జరిగాయట!! యిప్పుడు స్వరాజ్యం యింట్లోనే కులాసాగా తిరుగుతోందట!! నన్ను విపరీతంగా కదిలించి ఆశ్చర్య పరచిన తాజా వార్త మరొక్కటి స్వరాజ్యం గారపళ్ళ రాఘవరావు గాడ్ని పెళ్ళాడు తోందని!!

ఆ సాయంత్రం స్వరాజ్యం వాళ్ళింటి కెళ్ళాను. వాళ్ళ నాన్నగారా సమయంలో ఎక్కడికో వెళ్ళారు.

"వాట్ మిస్టర్ . రాజూ! ఏవిటి విశేషాలు? ఈ మధ్య వూళ్ళో లేవుట " అంది, స్వరాజ్యం ఎదురు వచ్చి

"అది సరే! మళ్ళీ పెళ్ళి చేసుకుంటున్నావుట?" అన్నా, ధైర్యంగా ...పిల్ల పోయి నందుకు సానుభూతి చెప్పాలని కూడా నా కినిపించలేదు.

"అప్పుడే పీదాకా వచ్చిందా?" వేళా కోళంగా అంది.

"నిజమేనా?" మళ్లీ అడిగాను.

"ఏం చేసుకోకూడదా?" సూటిగా చూస్తూ అంది, స్వరాజ్యం.

"లక్షణంగా చేసుకోవచ్చును! కాని వాడు తప్ప యింకెవడు దొరకలేదా?"

"ఏం? వాడికేం?? వాడు నా కోసం యిదివరకెన్నో ప్రయత్నాలు చేశాడు. ఆ సంగతి నీకూ తెలుసు! నా పెళ్ళయి పోయినా వాడి ప్రయత్నాలు మానలేదు మా ఆయనకి ఆకాశరామన్న ఉత్తరాలు రాశాడు. పది మందిచేత రాయించాడు ఈ వీధిలో వాళ్లు చాలా మంది వాడికింతో అంతా సహాయపడ్డారు కూడా!! యికపోతే నా విడాకుల కథనంలో వాడికీ చెప్పుకో తగ్గ పాత్ర వుంది! యిప్పటికే నా చుట్టూ కుక్కలా తినుగు తున్నాడు నేనంటే పడిచస్తాడు....వాడిలాంటి వాడు నా కింకెవడు దొరుకుతాడు చెప్పు? ఊఁ?'

"మరి మీ నాన్నగారు ఒప్పుకున్నారా ఈ పెళ్ళికి??"

"ఆయన నా మాటెప్పుడు కాదన్నారు?"

"కానీ ఒక్క విషయం స్వరాజ్యం! నీ మేలు కోరిన వాణ్ణి కనక చెప్తున్నాను ఆ గారపళ్ళ రాఘవరావుగాడు అంతమంచి వాడు కాదు. వాడికి మొదట్నుంచీ నీ కంటె నీ ఆస్థి అంటేనే ఎక్కువ మక్కువ అన్నా ఆఖరికి.

"ఆ సంగతి నాకు తెలుసు మిస్టర్ శ్రేయోభిలాషి! కాని నా జీవితంలో నిప్పులు కురిపించిన వ్యక్తుల్ని అంత సులభంగా క్షమించి వొదిలెయ్యలేను నేను! ఓ పట్టు పట్టి చూస్తాను. రేపు పెళ్ళయిన తర్వాత నా భర్తగా వాడి బ్రతుకెలా వుంటుందో నువ్వే చూద్దువుగాని! వాడే కాదు లేనిపోని అపోహలు సృష్టించి నా కాపరంలో నిప్పులు పోసిన వ్యక్తులు చాలా మంది వున్నారీవూళ్లో ముఖ్యంగా యీ వీధి..ళ్ళ వాళ్ళందర్ని కూడా ఒక చూపు చూడ దల్చుకున్నాను. నువ్వే చూస్తావుగా."

అంటూ సూటిగా నా వైపు చూసి, అంతలోనే కేర్‌లెస్‌గా కను బొమ్మ లెగరేసి గట్టిగా నవ్వింది స్వరాజ్యం.

ఈ సృష్టిలో కెల్ల అతి కష్టమైందేమిటయ్యా అంటే 'ఆడదాని అంతర్యం' అని ఎక్కడో చదివినట్టు గుర్తు,

స్వరాజ్యం కేసి అలాగే చూస్తూ కూర్చుండి పోయాను స్థాణువులా. ●



'జ్యోతి' చిన్న కథల పోటీలో గెలుపొందిన కథ

# మోహనరాగం

రామవరపు జగన్మోహనరావు

సురేఖ

సోమయాజులగారి ఏకైక పుత్రిక.

సోమయాజులు గారంటే ఆ టౌనుకి తల నెరిసిన మహో ఆలివర్ వెండెల్‌హోమ్సని పుర ప్రజలు రిఫర్ చేస్తుంటారు. సోమయాజులుగారికి బేంకులో బ్రేవ్(వో) మనే బేలన్సూ, కలకట్ట రేటులో బోలెడు పలుకుబడీ వున్నాయి!

సోమయాజుల గారి సిరిగల తల్లి సురేఖ మెడిసిన్ సెకండియర్ చదువుతోంది చలం కథలన్నా సిడ్నీ పయిటర్ సినిమాలన్నా పడి చస్తుంది గెస్‌హూయీజ్ కమింగ్ ఫర్ ది డిన్నర్ సినిమాని ఎన్ని సార్లు చూపిందో మనం గెస్ చెయ్యడం కష్టం కష్టం. చాలా కష్టం

సోమయాజులుగారు తన ఏకైకపుత్రిక అభిరుచులు గమనించక పోలేదు గానీ. అతని మనసు ఆసియా అంతా విశాలమైనది. అతని ప్రపంచం కలకట్టరేటు, అతని ఎర్ర రక్తకణాలు కరెన్సీనోట్లు

రవి సోమయాజులుగారి వేలు విడిచిన మేనల్లుడు. ఆయన దగ్గర అప్రెంటిస్‌గా పని చేస్తున్నాడు. ఈ సువిశాల ప్రపంచంలో అతనికావల్సిందల్లా సురేఖ, షాంపేన్ (సోమపానమా?) సోఫియాలోరెన్ సినిమాలు.

సుధాకర్ బతికి చెడ్డ వెనక తరగతికి చెందిన వారసుడు. (యల్ యం యి ఫస్ట్‌క్లాసులో పాసయ్యేడు. ఇన్నాళ్ళూ చదువుకి పెట్టిన పెట్టుబడి లేదా మొక్కుబడి ఏ కిల్లీబడ్డీకైనా పెడితే ఈ పాటికి సుధాకర్ 'కంసర్న్సు' కి సోల్ ప్రొప్రైటర్ని అయ్యేవాణ్ని ఆదా అన్నేపి పాల్ గెట్టీలాగ గట్టిగా ఆలోచించే (యం బి బి యస్) (మెంబర్ ఆఫ్ బేకార్ బేచిలర్స్‌సొసైటీ) విద్యార్థి ప్రస్తుతం విజయ్ ఆటోమోబైల్స్‌లో మెకానిక్‌గ్గా పని చేస్తున్నాడు.

అవేళ

ఎప్పట్నించో ఎదురు చూస్తున్న సిడ్నీ పాయిటర్ నటిస్తున్న 'ఇన్ ది హీట్ ఆఫ్ నైట్' ని చూడ్డానికి బయలుదేరింది. సురేఖ దారిలో కారు ట్రబులిచ్చింది. అది లోనే హంసపాదు వేసినందుకు అందంగా విసుక్కుని 'విజయ్ ఆటోమోబైల్స్' కేసి దారి తీసింది.

"మేడం, వాట్ కేన్‌ఐడుఫర్ యూ?" చంకలో 'జ్యోతి' ని భద్రంగా ఇరికించు

కుని. కాకి పేంట్‌లో టక్కు చేసిన కాకి చొక్కా నమ్రతగా అడిగింది

మరేం లేదండి మైనర్ కారు ట్రబుల్ అర్జంటుగా లీలా మహల్‌కి వెళ్ళాలి నా కోసం స్నేహలత ఎదురు చూస్తూవుంటుంది. 'ఐ షుడ్ నాట్ మిస్ ఇన్ ది హీట్ అఫ్ నైట్'

'యు విల్ బి ఇన్‌ద్ హీట్ అఫ్‌నైట్ ఇన్ రైట్ టయం, ఒకే మేడం''

నవ్వుతూ అంది కాకి చొక్కా,

''థాంక్యూ. ఓ సారి 'జ్యోతి నిలా ఇస్తారా?''

''జ్యోతి' లో ''ఉద్యోగపర్వం". కథ ఊపిరి బిగపట్టి చివరికంటా చదివేసి దీర్ఘ మైన నిటూర్పు విడిచింది. ఆ 'సుధాకర్' ఎవరో తెలియదుగానీ మంచి టెక్నిక్‌తో మనసుని ఆకట్టేలా గమ్మత్తుగా కథలు రాస్తాడు. సిడ్నీ పాయిటర్ తర్వాత తనకి నచ్చిన మరో మహానుభావుడు సుధాక రేనేమో!

పాయ్‌ం పాయ్‌ం

ఊహా లోకంలోకచి విజయ్ ఆటో మోబైల్స్ ఆవరణలోకి పడ్డది సురేఖ.

''హలో ఎక్స్యూజ్‌మీ దీన్లో సుధా ర్ ఉద్యోగం పర్వం చదివేరా ఎలా వుంద''

'చదువేమిటి వేడం! రాసింది నేనే పాయిటర్ లాగే ఉన్నా స్తూ బదలి చ్చేడు. మెకానిక్ రచయిత

'సీయూ ఎగైన్'' అని కారెక్కింది సురేఖ

అవే మెరుపు కళ్ళు, అవే మొలక నవ్వులు, అవే పెదాల వొంకర్లు, అదే హస్కీవాయిస్ ఆ క్షణానికి మాత్రం 'సుధాకర్‌ని సిడ్నీ పాయిటర్‌నీ ఒకే లాగ పలకాలిస్మీ' అనుకుంది సురేఖ.

* * *

రవి ఒళ్ళు మండిపోతోంది.

అవును మరి. తన దనుకున్న సురేఖ తనదికావల్సిన సురేఖ పక్క సుధాకర్ సినిమాల్లోనూ, కార్లలోనూ, ఎగ్జిబిషన్ లోను — వాట్ — నాట్ — ఎక్కడ కనబడితే అక్కడ వాళ్ళిద్దరూ కనిపించడం షిర్ డిస్‌గ్రెస్ అనిపించింది ఒళ్ళు కుత కుతమని కసితో ఉడికిపోతూంది

అందుకని చెప్పి సోమయాజులుగారి చెవిలో జోరీగలా దూరి ఘీంకారం చేసేడు.

సుధాకర్ వుంటున్న హౌరా బ్రిడ్జి కుళ్ళు కాలవ వీధిలోకి పనిగట్టుకుని వెళ్ళి వాళ్ళ వాళ్ళతో ఏవో చాడీలు వర్ణించి పురె క్కించేడు ఆఖరి బాణంగా విజయ్ ఆటో మొబైల్స్ 'ప్రొప్రైటర్తో' సార్ ఇటు వంటి మెకానిక్స్‌వల్ల మీ 'గుడ్ వీల్' దెబ్బ తింటుంది.

సుధాకర్ ఉట్టిరోగ్, ఒట్టిపెరో! అని ఏవేవో చాడీలు పూసగుచ్చి చెప్పేడు. అంతా విని అన్నాడు న్నదయువతికము దాస్పందుకున్న హార్యా చర్య మహా శయుడు విజయచంద్ర అగర్వాలా.

తల్లి తండ్రుల్ని, మెకానిక్స్ యూని యన్ని, విజయ్ ఆటోమొబైల్స్‌నీ తతిమా

సంఘాన్ని వెలివేసి సురేఖా సుధాకర్లిద్దరూ హాయిగా రిజిష్టర్‌మారేజ్ చేసుకుని ఛలో బెంగుళూర్ అన్నారు.

అక్కడ ఏదో మోటారు. కంపెనిలో సీనియర్ మెకానిక్‌గా చేరిన సుధాకర్ కొన్నేళ్ళకి టెక్నికల్ అడ్వైజర్‌గా స్థిర పడ్డాడు నర్స్‌ట్రైనింగ్ పూర్తిచేసిన సురేఖ ఇప్పుడు 'సురేఖా నర్సింగ్ హోం' నడుపుతోంది. ఇప్పుడు సుధాకర్ చెడి బతికిన కుటుంబానికి వారసుడు,

ఇప్పటి సుధాకర్రావు గారికి బంగారం లాంటి బంగళా—బేంక్‌లో బే ఆఫ్ బెంగాల్ అంత బేలన్సూ ఎన్ని రకాలో స్టాకులూ —షేర్లు — 'జెనెటిక్స్' లో రిసెర్చి చేసిన పారిస్ రిటర్నెడ్ పుత్ర రత్నం వర ప్రసాదరావు — వున్నాయి వున్నారు.

రవి సురేఖా విరహంలో తలమునక లైనా చివరికి తేలి ఓ కామాక్షిని లక్ష ణంగా పెళ్ళి చేసుకుని సురేఖ జ్ఞాపకాలికి ఫుల్‌స్టాప్ పెట్టాడు.

సోమయాజులుగారు తన యావదాస్తినీ అనాథ బాలికాశ్రమానికి పంచి పెట్టి కన్ను మూశారు.

ప్రస్తుతం రవిబాబు ఏదో ప్రైవేట్ కంపెనీలో, గుమస్తాగా జీవితాన్ని ఈడు స్తున్నాడు. పెద్ద కూతురు ప్రసూన కాలే జీలో బియెస్సీ చదువుతోంది.

ఇన్ని ఒడుదుడుకుల్లో కూడా శ్యామల కాలేజి చదువగలగ డానిక్కారణం.

* సీనియర్ లెక్చరర్ ప్రసాదరావుగారి చలవ.

ప్రసాదరావుగారు అన్నిదేశాల అం దాల్ని చూసేరుగానీ వాటికి నిర్వచన రీయ డానికి వెనకా ముందు ఆలోచించలేదు, కానీ, ప్రసూన అందాల్ని నిర్వచించలేక పోయినందుకు తనపట్టా—ఫెలోషిప్పులు బూడిదలో పోసిన పన్నీరనుకున్నారు. ఫ్రీగా ప్రైవేట్లు చెప్పేవారు. పుష్ ఇచ్చే వారు. ప్రసూన యూనివర్సిటీ ఫస్ట్‌గా వచ్చింది

* *

ఆ సువార్త చెప్తూనే ప్రసూన వాంతి చేసుకుంది. మంచమెక్కింది. అదెలాంటి జ్వరం అర్థంచేసుకోడానికి కామాక్షమ్మకి క్షణంకూడా పట్టలేదు. ప్రసూన జరిగిదంతా పూసగుచ్చినట్లు చెప్పింది.

అప్పుడే అమ్మలక్కలు చెవులు కొరు క్కోండం, బుగ్గలు నొక్కు కోడంలు ప్రారంభమయ్యేయి.

రవిబాబు జీవితంలో మరో షాక్. గుండెలమీద ప్రెషర్ కుక్కర్. చల్లార్చ టం చాలా కష్టం.

రేపోనేడో ప్రొఫెసరయే ప్రసాద రావుకి గుమస్తా కూతురు ప్రసూనకీ—

టీస్ ఏ క్రైం బిట్వీన్ దెమ్ అనుకున్నాడు. అయినా ఆ సైన్సు లెక్చరర్ గారికి ఆ మాత్రం బుద్ధుండొద్దూ... మరి ఆ వయసులోవున్న ఆడవాళ్ళకు ప్రైవేట్లు చెప్పడం అని కాబోలు! షేబీ. ముక్కుతాడు కట్టి మరీ ప్రసూనకి మూడు ముళ్ళు ప్రసాదరావు చేత వెయ్యించాలిగాక వెయించాలి అనుకున్నాడు. గుమస్తా రవిబాబు తాడోపేడో తేల్చుకుందాం వచ్చేప్పి కూతుర్ని అడ్రసడిగి, లెక్చరర్ ప్రసాదరావింటికి బయల్దేరేడు రవిబాబు గబగబా

*  * *  *

చేరుకోవల్సిన స్థలం దగ్గరపడింది. కొత్తగాకట్టిన 70యంయండియేటర్లాగుంది భవనం. తోటమాలిని తప్పించుకుని పోర్టికోలో రంగురంగుల మొక్కల్ని చూస్తూ కాలింగ్ బెల్ నొక్కేడు.

టామి 'భౌ భౌ' అంది.

"క్వయట్ టామి క్వయట్!" అంటూ ద్వారం దగ్గర తాంబూలాలు నవ్వుల్తూ అపర పార్వతి పరమేశ్వర్లులా ప్రత్యక్షమయ్యేరు సురేఖమ్మగారూ—సుధాకరం గారు!

అవక్కాయి ముద్దపడి పోయేడు రవిబాబు.

*  *  *

# రాంగ్ నంబర్

శైశిపాల

కిటికీ రెక్కలు తెరిచింది కాత్యాయిని—బయట పడుచుదనం కోరిక లాంటి చిక్కని చీకటి పరుచుకొంది.

గడియారం కేసి చూసింది—ఏడున్నర అతనింకా రాలేదు చాలా ఆలస్యమయింది.

అతను రావాలి. రాకుండా ఉండడు కాని ఇంతవరకు రాలేదు అందుకే నిరీక్షణ.

పది నిముషాలలాగే నిల్చుండిపోయింది చీకట్లోకి చూస్తూ. ఉదయం జరిగిన సంఘటనతో మనస్సు ప్రశాంతంగా లేదు అలల్లాంటి ఆలోచనలు.

మనసు కుదుట పడ్డానికి రికార్డు ఎదుట పెట్టుకొని ఈజీచైర్‌లో కూర్చుంది.

చేతులు యాంత్రికంగా పుటలు తిప్పుతున్నాయి. అరగంట గడిచింది. ఇంకా రాలేదతను. అనివార్యమైన కారణాల వలన ఆగిపోలేదు కదా! గతంలో రెండు మూడుసార్లు పిలిచినప్పుడు సరిగ్గా టైమ్‌కే వచ్చాడు. శైలజను పిల్చినా బాగుండేది. ఆమె కనవసరంగా శ్రమ ఇవ్వడం ఎందుకని ఇతగాడ్ని పిలిస్తే,

తలుపు చప్పుడువిని తలెత్తి చూసింది. గుమ్మం వద్ద శంకర్రావు.

"క్షమించండి సైకిలు పాచీ పడింది. చెప్పిన టైముకు రాలేకపోయాను. ఎంత రాత్రయినా పని పూర్తి చేసి మరీ వెళతాను" గుమాస్తా లక్షణాలు జీర్ణించుకుపోయిన విధేయత అతని మాటల్లో తొణికిసలాడుతోంది.

"అలాగే" పుస్తకాలు అతని ముందు పెట్టి లోపలకు వెళ్ళిపోయింది.

గడియారం ముల్లులు కదులుతున్నాయి అతను వంచిన తల యెత్తకుండా రాస్తూనే వున్నాడు. ఆమె వచ్చి అతని కెదురుగా కూర్చుంది. పని తొందరగా తెమలడానికి అవసరమైన చోట్ల డిక్టేట్ చేస్తోంది. అక్కడక్కడా రెండు మూడక్షరాలు తడితో అలుక్కుపోవడం ఆమె కంట బడింది అతని అవస్థను గమనించింది కాత్యాయిని. చెమటతో పూర్తిగా తడిసిపోయిందతని చొక్కా. లోపల కెళ్ళి టవల్ తీసుకొచ్చి ఇచ్చింది.

"ఫాన్ కొందా నుకుంటున్నాను" రిలీఫ్‌కోసం మాట్లాడించాలని.

"కొనండి. మీకు తప్పని సరిగా వుండాలి" క్రింది ఉద్యోగి లక్షణాలు అతనిలో పుష్కలంగా వున్నాయి.

తిరిగి సంభాషణ సాగలేదు అతని వంక కళ్ళప్పగించి చూస్తూ కూర్చుందామె. అతడు పని పూర్తి చేసి లేచేసరికి గడియారం పన్నెండు కొట్టింది. సైకిలు



తీసుకొనేసరికి పాచీ పడిన విషయం గుర్తుకొచ్చింది. అయినా నడిపించుకు వెళ్ళాలి.

కాత్యానికి బయటకు వచ్చింది. ఆకాశంలో ఓ మెరుపు. అప్పుడు తెలిసింది. వర్షం తుంపర్లుగా పడుతున్నట్టు. వర్ష

మెప్పుడు ప్రారంభమయిందో! ఈదురు గాలికి ఆమె శరీరం వణికి పోయింది. .జై శంకర్రావు సైకిలు దింపుకుంటున్నాడు.

"శంకర్రావ్, వర్షంలో వెళ్తావా?"

"ఫర్వాలేదండి" (మొగమ్మటస్థుల పదం.)

"వద్దు ఈ గాలిలో ఎలా వెళతావ్. డ్రాయింగ్ రూంలో పడుకో."

సంశయిస్తూ అతను సైకిలు పైన పెట్టాడు. అతనికి చాప, దుప్పటి యిచ్చి మధ్య తలుపు లేపి తన గదిలోకి వెళ్ళి పోయిందామె. అతడు లైట్ ఆఫ్ చేసి పడుకున్న చప్పుడు

బయట గాలీ వానా ఎక్కువైనట్టు లోపలకు ఉరముల శబ్దాలు వినిపిస్తు న్నాయి. ఎంత ప్రయత్నించినా నిద్ర రావడం లేదు. ఉదయం సంఘటనే తిరిగి తిరిగి కలవర పెడుతోంది లూసీ గురించి ఆలోచనలు.

* * *

"మిస్ లూసీ!" ఆమె కంఠం ఉరి మింది ఆమె కళ్ళవైపు చూడలేక లూసీ తలవంచుకుంది.

"ఇది వరకే నిన్ను రెండు సార్లు మందలించడం జరిగింది, అయినా నువ్వేం లక్ష్య పెట్టలేదన్న మాట. మీ ఉత్తరాలు ప్రేమ కలాపాలూ నలుగురికీ తెలిసి పోయాయి. ఈ రోజు వాళ్ళ ఫాదర్ దగ్గ ర్నుండి రిపోర్టు కూడా వచ్చింది. నా ఆధ్వర్యంలో అమ్మాయిలింత విచ్చల విడిగా తిరుగుతున్నారంటే నా కెంత అవ మానం!" ఆవేశంతో వాక్ప్రవాహం పర గెట్టింది

"క్షమించండి మేడమ్—మళ్లీ చెప్ప తున్నందుకు నేను శశిధర్ని మనస్ఫూర్తిగా ప్రేమించాను" చెదిరిపోయిన ధైర్యాన్ని కూడ గట్టుకుంటే ఆ ఒక్క వాక్యం పెగ లింది.

'షటప్! సిగ్గు లేదూ.ప్రేమించావట! అంతస్థుల మాటెలావున్నా కులం? బహుశా అతనిడబ్బు చూసి ఆశపడుతున్నా వనుకుంటాను'' కోపంతో కనుబొమలు ముడివడ్డాయి.

"పవిత్రమైన ప్రేమకు జాతిమత భేదా లున్నాయనుకోను మీరు కూడా "

"సినిమాల్లో లాగ, నవలల్లో లాగ డైలాగులు అప్పచెప్పకు. ఇది జీవితం అయినా నీకు నాలో సగం వయస్సుంటుం దేమో! నువ్వేదో ఉద్ధరిస్తావని మీ వాళ్ళి క్కడికి చదువుకి పంపిస్తే నువ్వేమో ప్రేమాయణాలు సాగిస్తున్నావ్ ఇదేనా నీ కర్తవ్యం? ఆ మాత్రం జ్ఞానం అక్క రలేదా?" లూసీ పట్ల తన కున్న చనువు నంతా ఉపయోగించుకుంది.

"టీచర్, నేను చేసింది తప్పుకావచ్చు, కానీ మీరేం అనుకోపోతే ఒక్కమాట. వయస్సు వెన్నెల ఎవరికోసం ఆగవు. వాటిని సరిగా ఉపయోగించుకోగలిగితేనే జీవితానికి అందం. ఆనందం లేకపోతే

'నేనూ మనిషినే!' అన్న కథ రాసింది వీరేనోయ్!




మఱిగేపాలు ఎప్పుడో పొంగి బూడిదపాలవుతాయి. మీరు ముప్పయ్యో పడి ''

"యూ షటప్" ఆమె పిడుగు పడ్డట్టరిచింది.

"చనువిచ్చానని నీ యిష్టం వచ్చినట్టు మాట్లాడకు నన్నే చూపించేంతదానవయ్యావన్నమాట అసలు నీ విషయాన్ని ఇంతవరకు ఉపేక్షించడం నాదే తప్పు. ఈరోజే నీకు టి. పి. ఇచ్చి పంపిస్తాను" హృదయం అసహనంతో బుసలు కొడుతోంది.

"మేడమ్!" లూసీ ప్రాధేయ పడుతోంది.

"అవును నా నిర్ణయానికి తిరుగులేదు, నన్నేదో అన్నావని కాదు. నా స్కూలుకి మాత్రం చెడ్డపేరు రావడం నేను సహించలేను నిన్నెప్పటికి అభిమానిస్తాను నేను వ్యక్తిగతంగా కళారంగంలో నువ్వింకా రాణించాలని ఆకాంక్షిస్తున్నాను వెళ్ళు మధ్యాహ్నం కనిపించు ఈ లోగా టి. పి. సిద్ధమౌతుంది"

లూసీ మాట్లాడకుండా తలవంచుకొని వెళ్ళిపోయింది. వెళ్ళిపోతున్నామె వంక క్షణం నిదానించిచూసి క్లర్కు శంకర్రావును పిలిచి లూసీ టి. పి. సిద్ధం చెయ్యమని చెప్పింది హెడ్మిస్ట్రెస్ కాత్యాయిని శంకర్రావు క్షణం స్తబ్దుడై వెళ్ళిపోయాడు.

శంకర్రావే కాదు ఆ వార్త విన్న స్కూలు విద్యార్థినులు, అసిస్టెంట్లు—అందరూ ఆశ్చర్యపోయారు. కాత్యాయిని తన సిద్ధాంతాలు పాటించడం ఏ మాత్రం సందేహించదని అందరకూ తెలిసిన ఆ స్కూలులో ఆమెకి అభిమాన పాత్రురాలైన లూసీని స్కూలునుండి పంపించే కఠిన నిర్ణయం తీసుకుంటుందని ఎవ్వరూ ఊహిం

చలేదు నటనలోను చిత్ర లేఖనంలోను ఆ అమ్మాయి ప్రజ్ఞను చూసి ఎన్నోసార్లు అభినందించింది కాత్య యిని. స్కూలు వార్షికోత్సవాల్లోను, విద్యార్థినుల సమశ్యల లోను ప్రధాన పాత్ర ఆ అమ్మాయికే ఇచ్చేది. క్రమంగా ఇంటికి తరచు వచ్చి పోయేటంత సన్నిహితం ఆ అమ్మాయికి కాత్యాయని దగ్గరేర్పడింది. అటువంటి లూసీకి అంతగా అభిమానించే హెడ్ మిస్ట్రెస్ కాత్యాయని టి. సి. ఇచ్చి పంపి స్తుందంటే—

* * * *

కాత్యాయని రుజు ప్రవర్తన గురించి, సిద్ధాంతాల గురించి ఆ వూళ్లో గొప్పగా చెప్పుకుంటారు—చిన్నా, పెద్ద!

కాత్యాయనికి బియ్యిడి ట్రైనింగ్‌అయిన వెంటనే స్వగ్రామానికి నాలుగుమైళ్ళ దూరంలో అసిస్టెంటుగా ఉద్యోగం దొరికింది రికమండేషన్ లేనిదే ఉద్యోగం తాలుకా నీడకూడా పడని ఈ రోజులలో తనకు ఏ ప్రయత్నం లేకుండానే చేరువలో ఉద్యోగం దొరికినందుకు ఎంతో మురిసి పోయింది. ఈ రచయితలు రాస్తున్న లంచగొండితనం, ఇంఫ్లుయన్స్ వగైరాలు కేవలం ఆరోపణలను కుంది. స్వరాజ్యం వచ్చిన తర్వాత దేశం ఎంతో బాగు పడి పోయిందన్న విషయం మీద బాగా నమ్మకం కుదిరింది. కాని తర్వాత తెలి సింది—ఆమెకు వెంటనే ఉద్యోగం రావ డాన్కి కారణం కరుణాకరరావు గారి చల్లని చూపు ఆమె మీద ప్రసారించవడం మాత్రమేనని ఒక సారి కనిపించమని పిపి చేత కరుణాకర్రావుగారు కబురు చేశారు. ఆ ప్రాంతంలో క్రొత్తగా ఉద్యోగంలో చేరిన ప్రతిఆడది ఆయన దర్శనం చేసు కొని యధా శక్తి ఆయన మక్కువ తీర్చి రావడం ఆచారం లేకపోతే మంత్రుల స్థాయిలో పలుకుబడి వున్న ఆయన ఆగ్రహావేశాలకు గురి కావలసి వస్తుందని భయం. మానంకంటె ధనం ముఖ్యం గనుక బ్రతకడానికి దారికావాలి గనుక వివా హితలు కూడా ఆయన అభిమానాన్ని సంపా దించుకొనే భార్యలను కాదనలేక పోతు న్నారు ఇటువంటి విషయాలు చూచాముగా తెలిసినా చాలావరకు ప్రతి పక్షాల ప్రచార మనుకుంది కాత్యాయని. ఎందుకైనా మంచిదని కోవర్కర్స్ సలహా అడిగింది. ఉద్యోగంలో నాలుగు కాలాలపాటు ఉండా లంటే ఆయనకు కనిపించిరావడం మంచి దనీ, ఆయన తనవంటి కొంతమంది అదృష్టవంతుల మీద ప్రత్యేకమైన అభి మానం చూపిస్తుంటారని చెప్పారు. వెం టనే ఆ సాయంకాలం బయలుదేరివెళ్ళింది కరుణాకర్రావుగారి విడిది ట్రావలెర్స్ బంగళాకి. ఆమె వెళ్ళగానే ఎంతో ఆప్యా యంగా ఆహ్వానించి డి. ఏ. చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయాడు

"వచ్చావా?—రా కూర్చో ఎవరో గిట్టనివాళ్లు పెంకి ఘటానివని చెపితే...." జేవురించిన కళ్లు, గదంతా ప్రవహించిన

వాసన అతని స్థితిని తెలియజేస్తున్నాయి.

''ఎందుకో కబురు పంపించారని .. '

భయ భయంగా ' తెలియనట్టు— అయినా పంతులమ్మవి కదూ! ఎదుటివాళ్ళ చేత చెప్పించడం అలవాటు'' కుర్చీ చూపించాడు.

''ఫర్వాలేదండి'' ఆమె నిల్చునే వుంది.

''ఈ మాత్రం బెట్టుచెయ్యకపోతే నీ అందానికి విలువేముంది ' వచ్చి నడుం చుటూ చెయ్యవేశాడు.

ఆమె నిలువునా కంపించిపోయి నిలదొక్కుకుంది.

''నేనలాంటి దాన్నికాదు. నన్ను విడిచి పెట్టండి'' ప్రార్థించింది,

హేళనగా నవ్వాడు. చెయ్యిబిగిసింది.

''ఇంత నీచంగా ప్రవర్తిస్తారా ఆడదాని పట్ల'' బెదిరింపు ''బాగుంది. ఆడదానివి గనుకే'' విషపు నవ్వుతో వాసన గుప్పుమంది.

''మిష్టర్. మర్యాదగా విడిచిపెట్టకపోతే పోలీసులను. ..''

''వాళ్ళందరూ మన చేతిలో వాళ్ళని తెలియదు పాపం నీకు'' అతను నవ్వుతున్నాడు పగలబడి. ఆమె వణికిపోతోంది గువ్వలా.

తలుపులు తెరుచుకున్నాయి. డి. ఏ పరుగెత్తుకొచ్చాడు. డియప్పిగారు కరుణాకరరావుగారితో అర్జెంటుగా మాట్లాడాలని వచ్చారట! అదను చూసుకొని కాత్యాయని బయటకు ఉడాయించింది.

తర్వాత కరుణాకరరావుగారు రెండు మూడు కబుర్లు అటువంటి అందకత్తె తన కోరిక తీరిస్తే శాశ్వాతంగా పోషిస్తానని. ఆమె సుతారమూ అంగీకరించ లేదు. ఫలితంగా పనిష్మెంట్. అందరూ భయపడే మారు మూల వున్న 'కోనూరు' ట్రాన్స్‌ఫర్ అయింది. అక్కడే అందరి అభిమానం సంపాదించుకొని ఇన్నాళ్లూ పని చేసింది. ఈ సంవవత్సరమే హెడ్‌మిస్ట్రెస్‌గా ప్రమోషన్ వచ్చి ఈ వూరు బదిలీ అయింది.

ముప్పయ్యో పడిలో ప్రవేశించినా ఆమెలో అందంమాత్రం వదల లేదు. ఆమె వివాహం ఎందుకు చేసుకోలేదో మాత్రం ఎవరికీ తెలియదు. అడిగే సాహసం కూడా ఎవకీ లేదు. ఆమె తరచు పెళ్ళి విషయాల పట్ల వెళ్ళడించే అభిప్రాయాలను బట్టి ఆమెకటువంటి 'వాంఛ' లేదని శైలజ, కృష్ణప్రియ, ఉషారాణి మొదలైన వారి అభిప్రాయం. ఆమె నైతిక నిష్ఠనూ ఆమె వచ్చిన తర్వాత విద్యార్థునుల కలవడిన క్రమ శిక్షణను చూసి ఆ గ్రామస్థులందరూ ఆమె యెడల గౌరవం, అభిమానం యేర్పడాయి.

ఆ స్కూలులో ఫస్ట్ అసిస్టెంట్‌గా పని చేస్తున్న ఉమాపతికి సుమారు ముప్పైఐదే

జ్యోతి

ళ్ళుంటాయి, కాలు మీద కాలేసుకుని కూర్చుని తిన్నా గడిచిపోయే సాటి స్థిరాస్తి పూర్వీకులు గడించి ఇచ్చి పోయారు. అయినా కాలక్షేపం కోసం ఉద్యోగం చేస్తున్నాడు పెళ్ళయిన రెండు సంవత్సరాలకే భార్య చనిపోయింది సంతానం లేకపోయినా తిరిగి పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేక చాలమంది దూరవు బంధువులు మన్మదుడు ఇంద్రుడు, ఇత్యాది పదాలతో ఆకాశానికెత్తేసినా భూమ్మీదనే గట్టిగా నిలదొక్కుకున్నాడు. కాత్యాయని ఆ సర్కాల్లో ప్రవేశించిన తర్వాత ఆమె అందంకంటె నియమాల్నె తన్నెక్కువ ఆకర్షించాయని ఒకళ్ళిద్దరు ఆత్మీయులతో చెప్పుకున్నాడు. కాత్యాయని రాక ఆతనిలో సంచలనాన్ని లేవదీసింది రోజులు గడుస్తున్నకొద్ది క్రమంగా అతనిలో కోరిక బలపడసాగింది అందుకే ఎప్పుడైనా వ్యక్తి గత విషయాలు మాట్లాడుకొనే టప్పుడు ఆమె వివాహ విషయం ప్రస్తావించేవాడు ఆమె కోరిక తెలుసుకుందామని ఆమె వివాహం చేసుకోవోవడానికి బలమైన కారణమేమీ లేకపోయినా శ్రీహస్త్రమంతాలకు బంధాలనం పెంచుకుని తాపత్రాయం పడ్డం ఇష్టంలేదనిమాత్రం అనేకసార్లు స్పష్టంగా చెప్పింది. తర్వాత ఒకటి రెండు సార్లు తనకు నమ్మకస్థులయిన లేడి టీచర్ చేత ఆమె కిష్టమయితే తనామెను వివాహం చేసుకోడానికి సిద్ధంగా వున్నట్టు చూచాయగా తెలిసేలా చెప్పించాడు. ఆమెకపట్లో అటువంటి అభిప్రాయం లేనట్టు ఖచ్చితంగా చెప్పించి.

సైన్సు బి యిడి రమణమూర్తి ఆ స్కూల్లో అందగాడని ప్రతీతి. విద్యార్థినులు అతనికి 'నాగేశ్వరరావు' అతనికీ నిక్‌నేమ్ పెట్టినట్టు కాత్యాయనితోసహా అందరకూ తెలుసు. ఆ విషయం ఆతనికి తెలిసిన దగ్గర్నుంచీ మరింత సినిమేటిక్‌గా ప్రవర్తించడం మొదలు పెట్టాడు. వీలు చిక్కినపుడల్లా శైలజ, కృష్ణప్రియ మొదలయిన వాళ్ళతో బాతాఖానీ కొట్టేవాడు. ముఖ్యంగా శైలజ, రమణమూర్తి వరుసగదు కు వెళ్ళినప్పుడు పాఠాలు చెప్పడం మానేసి కబుర్లు చెప్పుకుంటారని విద్యార్థినులు చెప్పుకుంటుంటే కాత్యాయని చెవిని పడింది 'వివాహితుడైన అతనితో నీలాంటి దానికి అంత చనువుగా తిరగడం మంచిది కాదని' శైలజను సూటిగానే మందలించి కాత్యాయని తన చనువును పురస్కరించుకొని కాని శైలజ మాత్రం 'సోషల్ మూవింగ్' అవసరమని వేదించేది.

అవకాశం వచ్చినపుడల్లా రమణమూర్తి కాత్యాయని టేబుల్ దగ్గర చేరి ఆమె నెలాగో కవ్వించి నవ్వించాలని ప్రయత్నించేవాడు. శైలజకి రమణమూర్తి కాత్యాయనితో కూర్చోవడం అంత యిష్టం లేకపోయినా ఆమె తనను మందలించడానికి వీలులేకుండా ఇదీ మంచి దేనని సంతోషించేది. శైలజ, కృష్ణప్రియ

వయస్సులో వున్న-కాత్యాయినిలో అందం ఆకర్షణ వున్నాయని రమణమూర్తి అభిప్రాయం.

ఆ పూట లూసీని గురించిన ఆలోచనలతో మనశ్శాంతి పూర్తిగా కోల్పోయింది కాఫీకూడా తాగాలనిపించలేదు మధ్యాన్నం రమణమూర్తి వచ్చి ఆమె కర్తవ్య పరాయణతను ప్రశంసించి ఆమె చిరునవ్వు చూడాలని విఫల ప్రయత్నం చేసి చివరకు ఆమె విసుగ్గా యిచ్చిన కాఫీని అమృత తుల్యంగా భావించి సేవించి వెళ్ళిపోయాడు. చివరకు వ్యక్తిగతాభిమానం కంటె ఉద్యోగ ధర్మమే ముఖ్యమని మనస్సు తిరుగులేని నిర్ణయాన్ని జారా చేసింది. తర్వాత క్లర్కు శంకర్రావుని పిల్చి లూసీకి టి. సి. ఇచ్చి తనకు కనబడకుండా వెళ్ళిపొమ్మని చెప్పమంది. మరునటి రోజు ఇన్‌స్పెక్షన్ గనుక ఆఫీసు పని పూర్తి చేయడానికి ఆ రాత్రి క్లర్కు శంకర్రావును ఇంటికి హాజరు కమ్మంది ఆలోచించ కూడదనుకుంటూనే లూసీ గురించి ఆలోచిస్తుంటో లాంగ్‌బెల్ మేలుకొలుపు పాడింది,

* * *

కెరటాల్లా ఉరకలేస్తున్న ఆలోచనలు లూసీ నుంచి ఆమె మనస్సు వరకు చెదిరి పడుతున్నాయి

టీనేజ్ దాటని లూసీ ఎంత చొరవ తీసుకుంది 'ప్రేమ' విషయంలో!— కేవలం వయస్సు అనుకుంటే తను కాలేజిలో చదువుతున్నప్పుడు తన కోసం పడిగాపులు కాసిన వసంతరావు నెంత అవమానించింది! వసంతరావుకి అందానికి లోటు లేదు. పాపం! తర్వాత అతనికి మతి భ్రమించిందట. ఇంతమంది మగాళ్ళని తనుతేలిగ్గా నిరాకరించ కలిగింది. కాని లూసీ!—

ఆలోచనలతో గంట పైగా గడిచిపోయింది. దుప్పటి పూర్తిగా కప్పేసినా చలి తగ్గలేదు పాపం శంకర్రావు చాప మీద పడుకున్నాడు. చలితో బాధ పడుతున్నాడేమో మరో దుప్పటి ఇద్దామని గడియతీసి డ్రాయింగ్ రూంలో లైట్ ఆన్‌చేసింది చాపమీద పాంటు, బనీనుతో నిశ్చింతగా నిద్రపోతున్నాడు శంకర్రావు.

శంకర్రావుకి పాతికేళ్ళు దాటవు సామాన్యమైనఅందగాడు, ఉంగరాలజుట్టు సన్నని త్రాడులాంటి చిన్న మీసం ఆమెదృష్టి నాకర్షించాయి బలమైన బాహువులు లేత దనం చూపినఅమాయకమైన కళ్ళు అతని దృష్టి నదేపనిగా పిలుస్తున్నాయి. ఉన్నట్టుండి నిద్రలో అతని పెదాలపై చిరునవ్వు— ఆమెకు చక్కిలిగింతలు పెట్టినట్టయింది

ఒక్కసారిగా ఆమెనేదో మత్తు ఆవహించినట్టు—శరీరం తిరుగు బాటు చేస్తున్నట్టు—కాళ్ళు కథాకళి నృత్యం చేస్తున్నట్టు—ఆమెలో రకరకాల వికారాలు

వణుకుతున్న చేతిలోంచి దుప్పటి జారిపడి చప్పుడయింది.

శంకర్రావు కళ్ళు ఆమె వైపు-బిగువయిన నైట్ డ్రెస్‌తో స్పష్టంగా కనిపిస్తున్న అవయవ నిమ్నోన్నతాల వైపు - ఆమె అవయవ సౌష్టవాన్ని బట్టి వయస్సును అంచనా వేస్తున్నాయి,

ఎక్సరేల్లాంటి చూపులు పడగెత్తిన పడుచుదనంలోంచి కోరికలు బుసలు కొట్టాయి.

తడబడుతున్న కాత్యాయని చెయ్యి స్విచ్ మీద పడింది. చీకట్లో ఆకారాల్ని దుప్పటి కప్పేసింది.

* * *

తెల్లవారింది. ఆమెకు సైకిలు దింపుతున్న శబ్దం వినిపించి బయట కొచ్చింది. శంకర్రావు తల వంచుకొని వెళ్ళి పోతున్నాడు. రాత్రి కుండపోతగా వర్షించిన ఆకాశం నిర్మలంగా వుంది.

ఆమె కుర్చీలో కూలబడింది. వసంతరావు. కరుణాకరరావు, ఉమాపతి, రమణమూర్తి ఆమె కళ్ళముందు నిలబడి వెక్కిరిస్తున్నట్టు—

శంకర్రావు గుమాస్తా, వివాహితుడు- అయినా అవకాశం బలహీనతను రెచ్చగొట్టింది.

లూసీ తప్పుకు స్కూలు నుంచి బయటకు పంపేసింది మరి తను? ఆలోచించలేకపోయింది లూసీ చివర మాటలు గుర్తు కొచ్చాయి

మర్నాడు ఒకవార్త అందర్నీ ఆశ్చర్య పరిచింది — కాత్యాయని ఉమాపతిని వివాహం చేసుకోడాని కంగీకరించిందని'

ఆ మధ్యాహ్నం అలవాటు చొప్పున వచ్చిన రమణమూర్తి అడిగాడు "మేడమ్ ఇంత ఆకస్మాత్తుగా ఈ నిర్ణయాని కెందు కొచ్చారని"

"అంతా యాదృచ్ఛికంగా జరిగిపోయింది" ఆమె పేలవంగా నవ్వింది! •

# ఇది పాత కథే

పాలకోడేటి సత్యనారాయణరావు

వరామ్ ఒకసారిగ ఉలికి పడ్డాడు. ఉలికి పడటం శివరాంకు ఉన్న జబ్బుగాదు. అయినా ఉలికి పడ్డాడు—

ముందుగ కళ్ళలో దుమ్ముకొట్టి పోతున్న నల్ల అంబాసిడర్ కారును చూసి ఆ తర్వాత ఆ కారులో అదోలా కూర్చుని మరింకేదోలా చూస్తున్న అనురాధను చూసి ఆ తర్వాత అనురాధ ప్రక్కనే ఉన్న ఆ పూర్ ఫెలోను చూసి ఉలికి పడ్డాడు.

క్షణం తర్వాత బాధ పడ్డాడు. అలా అని బాధ పడటం శివరామ్‌కున్న హాబీ కాదు అయినా బాధ పడ్డాడు.

శివరాం బాధ పడ్డానికి పుట్టలేదు.

అయినా బాధ పడ్డానికే పుట్టినట్లు బాధలు పడ్డాడు ఆ బాధలన్నీ మర్చిపోయేటట్టు చేసింది అనూరాధ మళ్ళీ పాత జ్ఞాపకాలను తలదన్నే టట్లుగ బాధపడేటట్లు చేసిందీ అనురాధే!

అనూరాధ—పేరు అందంగ ఉంది. మనిషీ అందంగానే ఉంటుంది. మనసూ అంతేనను కున్నాడు పిచ్చి శివరామ్. 'దిగితే కానీ లోతు తెలీదు' అని సామెతకు దిగాడు. ఊబిలో మెడకంటే దిగిపోయాడు బయటకు రాలేకపోతున్నాడు. అంతా జ్ఞాపకాల బురద.

* * *

శివరామ్ ఉలికి పడ్డాడు — అనూరాధ అన్నది విని.

'ఉలికి పడతావేం శివం—' చాల ఈజీగ అంది అనూరాధ.

'చాల పెద్ద ఇబ్బందే గదా మరి— ఇపుడు '

'ఐసీ యూ ఆర్ ఏ ఫూల్. డార్లింగ్ శివం! ఇంత చిన్న విషయం కూడ అంత సీరియస్ "

"ఏ ఆరోగ్యం నాకేం చిన్న విషయం అనుకోకు అనూ!—నాకేదో భయంగా ఉంది, పొద్దున్న లేచీ లేవగానే కక్కాలనన్నావా? అంటే ఏమిటో తెలుసా? "

'కక్కితే అజీర్ణం చేసిందనుకోవాలి, లేకపోతే .'

'లేకపోతే?—' ఆందోళనతో అడిగాడు శివరామ్.

'లేకపోతే ఏముందీ, అదే!....' చాల సింపుల్‌గా అనేసింది అనూరాధ.

శివరామ్‌కు తల తిరిగి పోయింది.

ఎదురగ ఉన్న చాక్లెట్ రంగు ఫియట్ కారు అంబాసిడర్‌లా కనిపించింది.దూరాన ఉన్న కొండ కదులుతున్నట్లు అనిపించింది.

దగ్గరే ఉన్న ఆడది-అనూరాధ - ఆడదిలా మాత్రం కనిపించటంలేదు, కనీసం అనిపించటం లేదు.

ఒంట్లో ఉన్న శక్తినంతా కూడ దీసుకొని అడిగాడు—'అదే, అంటే....'

' . ' అనూరాధ సిగ్గుపడలేదు, కనీసం నటించలేదు—క్షణం ఆగి, పోర్షన్ మర్చిపోయిన పాత్ర ధారికి ప్రాంప్టర్ అందించిన పదాలు అందుకొని కొత్త నటుడన్నట్లు-అంది—' ఇంకా సరిగా తెలీదనుకో, డాక్టర్ దగ్గరకు వెళ్ళాలి. ఎలాగు నువ్వు కనిపిస్తావు గదా, నిన్ను తోడు తీసుకెళ్దామనుకుంటున్నా-సరేలే. గానీ రా! పోదాం.'

'ఎక్కడకు?—'

'వెళ్ళి, కమలనాథ్‌ను అడిగి తెలుసుకొందాం—'

కమలనాథ్—అవును. లేడీ డాక్టరే! కమల ఆవిడ పేరు, రామనాథం ఆవిడ 'ఆయన' పేరు—మరి కమలనాథ్ మాత్రం లేడీ డాక్టర్ పేరు. అంతే!

శివరామ్ కదిలాడు. అరసెకను తర్వాత కారు కదిలింది.

* * *

శివరామ్ ఉలికిపడ్డాడు - కమలనాథ్‌గారి కన్సల్టింగ్ రూంలోంచి వచ్చిన అనూరాధ అన్నదిపుకి—'ఆ అదే! '

వివరణ కోసం శివరామ్ తలెత్తాడు.

'పదపోదాం!'

కారు కదిలాక అడిగాడు అసహ్యంతో 'ఇంతకీ ఏమంది ఆవిడ?'

గ్లాస్‌లోంచి ముందుకు చూస్తూ, స్టీరింగ్ వీల్‌ను సుతారంగా తిప్పుతూ, అతి సునాయాసంగ కారు నడిపివేస్తున్న అనూరాధను చూశాడు—అతనికి సత్యభామ గుర్తొచ్చింది పారిజాతాపహరణం చదవక పోయినా!

'చెప్పవేం?' అడిగాడు శివరామ్ మళ్లీ

'ఏముందీ చెప్పటానికి? అవిడన్నంత నేననుకొన్నదే!' నువ్వు తల్లి నవుతున్నావు. 'పొమ్మంది. అంతే!'

శివరామ్ సంతోషపడ్డాడు-తండ్రి అవుతున్నందుకు!

ఆవేళ, ఇద్దరూ మ్యాట్నీకనివెళ్ళి,సగం సినిమా చూసి ఇంటికి తిరిగొచ్చేయటం గుర్తొచ్చింది అతనికి ఇంట్లో గుర్తు చేసుకొని సిగ్గుపడ్డాడు.

'కంగ్రాచ్యులేషన్స్' అన్నాడు శివరామ్ ముఖము చేటంత చేసుకొని.

'ఎందుకు?' అంది అనూరాధ అతనికేసి తిరగకుండానే,

శివరామ్ సిగ్గు పడ్డాడు—ఎందుకో చెప్పటానికి కాదు. 'బాధపడేలా' చేసి నందుకు!

—తను త్త వెధవ! ఏదో ఆవేశంలో ఏదో చేశాడే కానీ అనూరాధకది ఎంత దెబ్బ, ఆమె బంగారు భవిష్యత్తు కది ఎంత ప్రమాదమో ఆలోచించలేదు-అనుకున్నాడు శివరామ్.

'సారీ అనూ! నువ్వేం బాధ పడకు!'

అనూరాధ ఆశ్చర్యంగా చూసింది—'బాధా? ఎందుకు?'

'నేను నిన్నేం మోసం చేయను—మా అమ్మా, నాన్నా అంతా ఏకమై వచ్చినా సరే, నిన్ను పెళ్ళి చేసుకొంటా ''

''వాళ్ళంతా ఏకమవట మెందుకూ మధ్యలో!''

అదే, మన కులాలు వేరుగదూ-. అయినా సరే. నువ్వేం బాధ పడకు? '

అనూరాధ కారు ఆపింది—'బాధ పడను కానీ . నీ రూం వచ్చింది '

శివరాం కారు దిగాడు కారులోని బొమ్మ ఇంకేం మాట్లాడలేదు.

* * *

శివరామ్ ఉలిక్కిపడ్డాడు - అనూరాధ ఫోన్ చేసిందంటే విని

వెళ్ళి రిసీవరందుకొన్నాడు - అంతా మౌనంగా విన్నాడ.

'సారీ శివరాం! నిన్ను బాధ పెట్టినట్లు న్నాను. తప్పదు మరి! ఏం చేస్తాం? నీ బిడ్డను నేను కంటే, మా నాన్న పరు వేంగాను? కమలనాధ్ గారి కంతా తెలుసు ఎక్కువగ ఏమీ బాధపడలేదు. కొంచెంగా ర క్తం పోయింది, అంతే, అనుకో .'

'అనూ, ఇలా చేశావేం'' మాటలు పేర్చుకొని అడిగాడు శివరామ్.

''ఏం చేయను, చెప్పు? కులం కాని వాణ్ని చేసుకొంటే చిల్లి గవ్వ ఆస్తి ఇవ్వరు గదా మా డాడీ! నీకు తెలుసుకాదు లేకపోతే కాలు కదలదు నాకు అందుకే,'

'నేను నిన్ను నేను పెళ్ళి చేసుకొంటా నన్నాగదా అనూ '

'పెళ్ళా—అన్నావ్ అనుకో అయినా పెళ్ళి చేసుకొని ఏం సుఖపడతాం మనం? ప్రేమించుకొన్నాం పెళ్ళి చేసుకొన్నాం. ఇదంతా చిన్న తనం ఉంటాను మరి '

'అనూ . మాట, పోనీ మనబ్బాయి నయినా నాకివ్వాల్సింది. పెంచుకొనే వాణ్ణి

'మనబ్బాయా? ఇంకెక్కడ?'

శివరామ్‌కు అవతలపక్క అన్నది అనూరాధ - కాదనిపించింది. అప్రయత్నంగ గంగమ్మ తల్లి గుర్తు వచ్చింది—భీష్మ చరిత్ర చదవక పోయినా

* * *

ఆ గేట్లోంచి నల్ల అంబాసిడర్ కారు తిరిగొస్తోందో, అనాలోచితంగ ముందు

కెళ్ళాడు శివరామ్. కారు ఆగింది. వెళ్ళి కూర్చున్నాడు.

క్షణం సేపు మనసులో రిహార్సల్ చేసుకొని అడిగాడు-'ఒక మాట, మారేమి అనుకోకపోతే.'

'అడగండి—' అన్నాడా యువకుడు.

శివరాం అడిగాడు—' ఆవిడ అదే, అనూరాధ, మీకెలా తెలుసు?'

'అంటే?—'

'క్షమించండి, మిమల్ని నొప్పించడం నాకు ఇష్టం కాదు, కానీ ..'

'ఆవిడ నేనూ ప్రేమించు కొన్నాం.'

'పెళ్ళి చేసుకుంటున్నారా?' శివరామ్ ఆత్రుతగ అడిగాడు.

కారు ముందుకు దూసుకొంటూ వెడుతోంది. అతనేం జవాబు చెప్పలేదు.

కారు ఆగింది. శివరాం దిగుతూ అన్నాడు 'నేనడిగిన దానికి జవాబివ్వలేదు మీరు?'

అతను నవ్వాడు—'ప్రేమించటం పెళ్ళి చేసుకోవటానికి కాదు అనుభవించటానికి—అంతే! కానీ అడిగారు కాబట్టి ఒకమాట, నేను అనూరాధ చేసుకుంటానని అనుకొంటోంది ఆవిడ. అదీ కథ-' కారు కదిలింది. దుమ్ము రేపుతూ, రొద చేస్తూ బయలుదేరింది

—శివరాం ఉలిక్కి పడ్డాడు. ఉలికిపడటం శివరాంకు ఉన్న జబ్బేమీ కాదు. అలా అని అది హాబీ కాదు. అయినా శివరాం ఉలిక్కి పడ్డాడు.



"నేటి కాలేజీ ఎలక్షన్లే రేపటి క్యాబినేట్ ఎలక్షన్లు!" అనేది నేటి బాలలూ, యువకులే రేపటి పౌరులూ నాయకులూ అనే దానికి కంటిన్యూయేషన్ సేయింగ్ అనడానికి సందేహం కనపించదు మా కాలేజీ 'ఎలక్షన్' హడావిడి చూస్తే!

విరలాచార్య టూ ఇయాన్ ఫ్లెమింగ్ సినిమాలు ఏకరువుపెట్టే నాలాటివాళ్ళు కూడా ఎటూ 'మూవ్' అవకుండా ప్రొద్దున్నించీ రాత్రిదాకా కాలేజీలోనే గడిపేస్తున్నారంటే మరి మా ఎలక్షన్' హడావిడి ఇంతా అంతానా?

రియల్లీ ఎ వెరీ వండరఫుల్ టైమ్ పాస్!

అసలు ఇంత ఎత్తున, ఐ మీన్, ఇంత భారీగా, ఎలక్షన్లు జరగడానికి కారణం ఏవిటో తెలుసా!

అప్పే ఏవీలేదు! గత నాలుగైదారేడు సంవత్సరాల్నుంచీ, అంటే మా ప్రస్తుత ప్రిన్సిపాల్‌గారి హయాంలో ఇప్పటిదాకా 'కాలేజీ స్టూడెంట్స్ యూనియన్' అనేదే లేకుండా చేశారు స్పెషల్లీ, ఈ సంవత్సరంలో మార్పేందుకు జరిగిందింటే చెప్పలేం గాని, (అఫ్‌కోర్స్ చెప్పినా బాగుండదనుకోండి!) జరిగింది!

ఒకానొక శుభసమయంలో చిన్న మీటింగ్‌లాటిది పెట్టి (ప్రత్యేకించి మీటింగు కాదు!) సదరు ప్రిన్సిపాల్‌గారి హయంలోనే 'కాలేజీ-డే' జరిగిన క్రితం సంవత్సరం నలుగురూ పోగైన సమయంలో") స్టూడెంట్స్‌కి నెక్స్టియర్ నుంచీ 'యూనియన్' ఏర్పాటు చెయ్యడం జరుగుతుందని ప్రిన్సిపాల్‌గారు ఎనౌన్స్ చెయ్యడంతో ('వందే మాతరం' అయి, అయిందనగానే స్టూడెంట్సు ఒక్కుమ్మడిగా లేచి, "మాకు యూనియన్ కావాలి" "మాకు యూనియన్ కావాలి" అంటూ కుర్చీలతో, బెంచీలతో, ఇనకతో, రాళ్ళతో ప్రదర్శన ఇచ్చినతర్వాత, పోలీసుల లాఠీచార్జి జరిగిన తర్వాత, వేదిక సగం తగలబడిన తర్వాత, 'చీఫ్ గెస్ట్'ని 'ఘెరావ్' చేసిన తర్వాత, గత్యంతరంలేక ప్రిన్సిపాల్ గారు సారీ, సరే' మీకు తప్పకుండా యూనియన్ ఏర్పాటు చేస్తాను! నిజమే! మీకు యూనియన్ కావల్సిందే...! తప్పకుండనూ !) అని ఏ ముహూర్తంలో అన్నారోగాని సరిగ్గా ఆవేళ నాంది మా ఈ ఎన్నికలకి సంతోషం పట్టలేక 'వంకాయలతో' పూలబాణా చేశారు మావాళ్లు! అవంటే మా ప్రిన్సిపాల్‌గారికి ప్రాణమని.

నిజానికి వారు ఆ నామధేయంతోనే గత పాతిక సంవత్సరాల్నుంచీ పేరు గాంచారని పెద్దల ఉవాచ!

"వంకాయ్‌కీ జై!" "ప్రిన్సిపాల్ వంకాయ్‌గారికీ జై" ఇవీ నినాదాలు అంటే ఈ సంఘటన క్రిందటి ఎకడమిక్ ఇయర్ ముందు జరగడంవల్ల, ఈ వారింకోజరగబోతున్న ఈ ఎలక్షన్లకీ ఒక్కొక్కళ్ళకీ ఆరేసి నెలలు టైము దొరికింది!

కాలేజీ ప్రెసిడెంట్‌గా, సెక్రటరీగా, జాయింట్ సెక్రటరీగా, డ్రమెటిక్ ప్రెసిడెంట్‌గా, సెక్రటరీగా, గేమ్స్ సెక్రటరీగా జాయింట్‌గా....వగైరా వగైరా పది, పదిహేను పోర్టుఫోలియోలకి నిలబడ్డ నూట పదకొండు మందికి ఆర్నెల్లు టైమ్ భలే 'ఎడ్వాంటేజియస్' అయింది? అందుకే ఓడిపోతామన్న బెంగ ఎవడికీ లేదు!

వాల్‌పోస్టర్లు అంటించడం, గోడల మీద సున్నాలతో వ్రాయడం, బల్లలమీదా కుర్చీలమీదా చెక్కడం, పెద్దపెద్ద అట్టల మీద వ్రాసి చెట్లకీ-చేమలకీ, కిటికీలకీ, ద్వారబంధ్రాలకీ వ్రేలాడదీయటం, కాలేజీ గేటునుంచి లోపల బిల్డింగ్ దాకా దార్లో రోడ్డంతా వ్రాయడం....ఈ బాపతు మామూలు, ఐ మీన్, ప్రతీ కాలేజీలో ఉండే ఎలక్షన్ల హడావిడికాదు చెప్పుకో దగ్గది!

"పేంప్లెట్లు! కరపత్రాలు!" ఇవి! ఎక్కడా కనీ వినీ ఎరుగని బాపతు!

"ఉత్తరహిందూదేశంలో 'రాఖీ' పౌర్ణమికి అన్నదమ్ముల చేతులకి 'రాఖీ' కట్టడం ఆడపిల్లలకు సరదా, పండగ! మీకు బ్రదర్‌లాంటి వాడ్నేనమ్మా నేను! మీరు 'రాఖీ'యే కట్టారనుకుంటాను! మీ ఓటు నాకు దయ చెయ్యరూ! అమ్మా! మీ గురించి నేను ప్రాణాలివ్వడానికి కూడా సిద్ధం! మీకు టెలిఫోన్లూ, రేడియోవగైరాల సౌకర్యాలతో 'సపరేట్ లేడీస్ వెయిటింగు రూమ్' లేదని నాకు తెలుసమ్మా! సరదాగా కాలక్షేపం చెయ్యడానికి, వేయించిన సెనగపప్పు, జీడిపప్పు వగైరాకేంటీనులలో లేవని కూడా తెలుసమ్మా! నిజం! ఇవన్నీ మీకు నెలరోజుల్లో వచ్చే పూచీ నాది. మనకు హక్కు ఉన్నప్పుడు తప్పకుండా సాధించాల్సిందే!....మరందుకే మీ ఓటు....! చిరంజీవిగాడిస్వరం మొదట్లో ఆవేశపూరితంగా, ఆశాపూరితంగా....చివర చివరికి బొంగురుగా....

"అసలు డ్రమెటిక్ అసోసియేషన్ అంటే ఏవిటి? వ్వాట్....వాటీస్ ది మీనింగు?"

మొహానికి రంగులు పూసుకుని గెంతడమా?

"కాదు!"

"కాళ్ళకి గజ్జెలు కట్టి గంతులెయ్యడమా?"

"కానేకాదు"

"మరి!"

పాత్రలు సృష్టించడం. ప్రాణం పోయడం, జీవితం నడిపించడం! అదీ నాటకం! నాటకరంగం అంటే........సమాజం మారాలి. మన సత్వాలు మారాలి! మనుషులు మారాలి!

ఎలా....?

మార్చాలి!

ఆ మార్పులకే పాత్రలు సృష్టించాలి! నడిపించాలి! అదీ అంటూ మొదలుపెట్టి 'సుడిగుండాల్లో', 'మరో ప్రపంచం'లో నాగేశ్వరరావు డైలాగులు ఒక్కటి కూడ

మిస్ కొట్టకుండా యాక్షనుతోసహా అప్ప చెప్పటం డ్రమెటిక్ ప్రెసిడెంట్ గా గెలవా లని సుబ్బారావు తహ, తహ-

"ఏషియన్ గేమ్స్‌లో భారతదేశాని కన్ని తక్కువ ప్రైజు లొస్తున్నాయేమో ఆలోచించారా? ఎంతసేపూ మనం 'వెనక పడ్డాం' 'వెనకపడ్డాం' అంటూ సాగతీసు కోడం తప్ప కర్తవ్యం మర్చిపోయాం! ఇంటర్‌కాలేజెస్‌లో, ఇంటర్ యూనివర్స టీస్‌లో, ఇంటర్ కాంటినెంటల్స్‌లో, ఇంటర్ నేషనల్‌లో మనది పై చెయ్యి అవుతుంది. అందుకు నా శాయశక్తులా కృషి చేస్తాను

"టెన్నిస్ - రామనాధన్ కృష్ణన్, క్రికెట్ పటౌడీ నావాబు, హాకీ జయచంద్ర సింగు, పుట్‌బాల్ బాబూరావ్, కబాడీ అవధాని, బ్యాట్‌మెంటన్ భావనారాయణా, భానూ, వీళ్ళంతా ఎవరనుకున్నారు? నా ఫ్రెండ్స్! క్లోజ్ ఫ్రండ్స్ !

నిజం, మీరొక్క వోటువేసి చూడండి! మీకే తెలుస్తుంది, నా సంగతి!

"ఎవ్రిబడీ బికమ్స్ ఎ స్పోర్ట్స్‌మేన్ అండ్ గెట్స్ ప్రైజస్!" గేమ్స్ సెక్ర టరీగా నామినేట్ చేసుకున్న 'టీమ్స్'గా పేరు మార్చుకున్న 'జేమ్స్' హడావి డది."

వాళ్లే రాశారో, యెవరిచేత వ్రాయిం చారోగాని -

"భానుమూర్తికే ఓటు సిరిసిరి మువ్వ మన భానుమూర్తికే ఓటు సిరిసిరి మువ్వ అంటూ ఓ పార్టీ సినిమా పాటల పుస్త కం సైజులో చినచిన్న పుస్తకాలు ప్రింటు చేయించి పంచిపెడితే....

చదివేసిన పేంపెట్లు 'రాకెట్స్'గా తయారుచేసి విసరాల్సిన శ్రమ లేకుండా 'రాకెట్స్' తయారుచేయించి, ఎలాస్టిక్ బ్రెడ్‌తో సహా సప్లయి చేశాడు మరొకడు.

ఇవన్నీ మచ్చుతునకలు మాత్రమే!

ఇక ఎక్సరసైజు పుస్తకాలు, పెన్సిళ్లు, చాక్లెట్లు, టైమ్‌టేబిల్స్ చెప్పనక్కరలేదు.

....

కాలేజీస్టూడెంట్స్ యూనియన్ ప్రెసి డెంటుగా పదిమంది, సెక్రటీస్‌గా పన్నెండు మంది, జాయింట్ సెక్రటరీలుగా పదహారు మంది ..ఇలా ఉన్న పది పోస్టుపోలి యోస్‌లకు సగటున పదిమంది నిలబడ్డంతో 'బేలట్ పేపర్' మూడు పేజీలు దాటే పరి స్థితి ఏర్పడింది! మోహన్, ప్రసాద రావులు నలుగురు, సుబ్బారావులు ఐదు గురు, సత్యన్నారాయణమూర్తులు ముగ్గురూ విజయ్‌కుమార్లు నలుగురూ, ఇలా మోస్టు కన్ఫ్యూజింగా తేలారు కంపేటర్సు! ఇది చూసేసరికి అసలు ప్రిన్సిపాల్‌గారే కన్ ఫ్యూజ్ అయిపోయినట్లున్నారు! అందుకే అనుకుంటా ఎన్నికల్లో ఓ క్రొత్త విధానం ఏర్పాటు!

"అబ్బాయిలూ! ఇదేం క్రొత్తకాదు! యూనివర్సిటీల్లో, క్యాబినేట్లలో ఇదే ఆచా రం! అది ఇక్కడ కూడా అనుసరిస్తేనే గాని ఈ ఎన్నికలు జరపడానికి వీలుకాదనే







విశ్వాసంతో ఈ మార్పు చెయ్యాల్సి వచ్చింది'' అంటూ పానెల్' ఎలక్షన్లకి ఉపోద్ఘాతం ఇచ్చారు ప్రిన్సిపాల్ గారు!

దాని ప్రకారం!

ఉన్న నూటపదిమందీ పది గ్రూపులుగా విడిపోతారు! ఒక్కొక్క గ్రూపులోఉన్న పదిమందికీ ఒకడు నాయకుడన్నమాట! వాడే ప్రెసిడెంటన్నమాట (గెలుస్తే!) అంటే ఇప్పుడు బాలెట్ పేపరు మీద పది పేరులే ఉంటాయి. అఫ్కోర్సు వాళ్ళవాళ్ళ పార్టనర్స్ పేర్లు ప్రక్కన వ్రాసిఉంటా మనుకోండి ఎవరో ఒకడిని ప్రెసిడెంటు సెలక్టు చేస్తే వాడి పేనల్ అంతా మిగతా పోర్టుఫోలియోలకి ఆటోమెటిగ్గా ఎలక్టైయి పోతారు! ఇదీ యూనివర్సిటీ లైఫ్ ఆఫ్ ఎలక్షన్సంటే . (ఐ మీన్ మీకిది తెలియ దనికాదు, అక్షరం, అక్షరం విడదీసి మా ప్రిన్సిపాల్ గారు చెప్పింది మళ్ళీ మీకు మనవి చేస్తున్నాను, అంతే !)

..... ...

పోటికి నిల్చున్న పదిమందిలో ముగ్గురు చెప్పుకోతగ్గవాళ్ళు! వాళ్ళే సుబ్బారావ్, చంద్రశేంరం, రాజేంద్రప్రసాద్ అలాగంటే (మిగతావాళ్ళు తీసిపోయిన వాళ్ళని కాదు.) వీళ్ళు ఒకడ్ని మించిన వాడొకడు.

బ్రహ్మాండమైన చాణుక్యుడి ఎత్తులు వీళ్ళవి!

చదరంగపుఆట వీళ్ళ చేష్టలు!

ఎవడెగా 'టాకిల్' చెయ్యాలో అలా టాకిల్ చేశారు అమ్మాయిల్ని

అందుకే అమ్మాయిల పరిస్థితి 'డైలమా' అయిపోయింది!

అందులోనూ 'మాలతి' పని మరింత ఇరకాటంలో పడింది! పాపం కాలేజీ బ్యూటీ అనిపించుకుందేమో కష్టాలు తప్ప లేదు. ఆమె పరిస్థితి తల్చుకుంటే యుద్ధంలో సహాయం చెయ్యమని కృష్ణుణ్ని ప్రార్థించడానికి వచ్చిన అర్జునుడు, దుర్యోధనుడూ గ్యారంటీగా జ్ఞాపకం వస్తారు!

అవునుమరి ముగ్గురూ ఒకర్నిమించిన వాడొకడుకదా!

.. .. . ...

ఎలక్షన్లైపోయాయి!

ఏడెనిమిది నెలలుగా ఎదురుచూసిన ఎలక్షన్లు ఇట్టే వచ్చి వెళ్ళిపోయాయి.

"మిస్ మాలతీ! కంగ్రాట్యులేషన్స్ కంగ్రాట్యులేషన్స్ మిస్ మాలతీ!" వారం పదిరోజులు ఎవడినోటివెంట విన్నా ఇవే మాటలు!

మైక్‌లో ఓసారి చదివారు, నోటీసు బోర్డు మీదా పెట్టారు!

అంతే!

కాని అందరి బుర్రలో నిల్చుండి పోయిందా 'పానెల్!'

ప్రెసిడెంట్... మాలతి

సెక్రటరీ. రాధ, జాయింట్ సెక్రటరీ: జయ!

గేమ్స్ సెక్రటరీ: రంగవల్లి,జాయింట్స్: స్వర్ణమాల, ప్రమీల!

డ్రమెటిక్ ప్రెసిడెంట్ సీతామహాలక్ష్మి సెక్రటరీ సుచరిత!

జాయింట్ మానస!

లేడీ రిప్రజెంటేటివ్ సుబ్బలక్ష్మి'

మా పది హేమాహేమీల మొహాలూ వ్రేలాడిపోయాయి'

అందులోనూ సుబ్బారావు, చంద్రశేఖరం, రాజేంద్రప్రసాదు వీళ్ళ పరిస్థితి ఆ దేవుడే చూడాలి!

"ఇదంతా నీవల్లే!"

"ఛ! నీవల్లే!"

నోర్ముయ్! నీ వల్లే!

అని వాళ్ళల్లో వాళ్ళు తిట్టుకోడానికి కారణం. వాళ్ళ ముగ్గురూ కలిపి విడి విడిగా కూడా మాలతిని కాలేజ్ గ్యాదరింగ్‌లో ఎడ్రస్ చెయ్యమనడం, అందు కొప్పుకున్న ఆమె జనాన్ని చూసి ముసి ముసి నవ్వులు నవ్వుతూ "ఈ కోలాహలం చూస్తూంటే, ఈ సరదా సందడీ చూస్తూంటే నేనూ పోటీ చెయ్యాలనేంత ఉత్సాహం వస్తోంది" అని హాస్యంగా అనడం అది టకీమని 'సుజాత' అందుకుని. 'యస్ దిస్ ఈజ్ ఎ వెరీ హాపీ న్యూస్! మాలతి మన కాలేజీ ప్రెసిడెంట్‌గా నిల్చుంటోంది! ఐ యామ్ ప్రపోజింగ్" అంటూ ఎనౌన్స్ చెయ్యడం, గీత "ఐ

సెకండ్'' అని సమర్థించడం నలు గురూ కరతాళాలూ, హర్షధ్వనాలూ .. ఒరిజినల్‌గా 'కాలేజీ బ్యూటీ' అయిన మాలతి క్రొత్త కళ్ళజోడు పెట్టుకుని లేతెస్టు శారీ కట్టుకొని అచ్చం ఫలానా హిందీసినిమాలో హీరోయినిలా తళుక్కు మనడం దాంతో రపా రపా ఓట్లన్నీ ఆమెకే పడిపోవటం—

''అ. ! మహా గెల్చిఏడ్చినప్పుడు కదా!'' అని ఎవడికి వాడు కాన్ఫిడెంటైన మా 'డిఫీడెన్ ప్రెసిడెంట్ల'గాళ్ళ ఓట్లు కూడా ఆమెకే పడిపోవటం....ఉన్నట్టుండి ఆమె ప్రెసిడెంటూ, అరక్షణంలో ఫారమ్ ఆమె 'పానెల్' మిగతా స్థానాల్ని ఆక్రమించుకోవడం

ఇదీ కారణం. పార్యాసనూ !

అయితే దీని క్యారణం "నువ్వే! నువ్వే!" అంటూ మా 'ఢిఫెన్స్‌మూక' దెబ్బలాడుకోవడంలోనే గడచిపోయింది మాలతీ నామ సంవత్సరం ! ●

---

# పనికిరాని పరిజ్ఞానం

సేకరణ: ఎమ్. రామారావ్, బరంపురం-2

1. గేతింగ్ అనే వ్యక్తి కనిపెట్టిన సాధనం పేరు మెషిన్‌గన్.
2. తుపాకీమందును మొట్టమొదట 'రోగర్ బైకన్' అనే వ్యక్తి తయారు చేసాడు.
3. బైకల్ అనే సరస్సు సరస్సుల్లో కెల్లా అతి లోతైనది, దీని లోతు 2,300 అడుగులు.
4. పశ్చిమ జర్మనీలో చెలామణి అవుతున్న కరెన్సీ పేరు 'మార్క్'.
5. 20,702 అడుగుల ఎత్తుగల అతి పెద్ద అగ్నిపర్వతము దక్షిణ అమెరికాలో ఉంది (ట).
6. అన్ని మ్యూజియంలలో కెల్లా 'బ్రిటీష్ మ్యూజియం' పెద్దది. ఇది లండన్‌లో స్థాపించబడింది.
7. క్రీ|| శ|| 1500 వ సంవత్సరములో 'పెడ్రో అల్వేర్స్ కేబ్రల్' అనే పోర్చుగ్రీసు దేశస్థుడు 'బ్రెజిల్' ని కనుగొన్నాడు.
8. నాచే పై విషయాలన్నిటిని వ్రాయించిన ఫౌంటన్ పెన్ ని కనిపెట్టిన వ్యక్తి పేరు 'వాటర్ మేన్'.

---

వల్ల కాడులో చీకటి సిరా వర్షంలా కురుస్తుంది కీచురాళ్ళ ధ్వనులు చీకటిలో ఈల పాటలు పాడుచున్నట్లుగా వుంది దానికి లయగా బ్రహ్మ రాక్షసుల్లా గాలికి చెట్లు తలలు విరబోసుకొని నృత్యము చేస్తున్నాయి. ఆకాశమునుండి భూమ్మీద కు బాంబులు విసురుతున్నట్లు పిడుగులు పడుతున్నాయి. దూరాన వల్లకాడులో నక్కలు వికారముగా గీపెడ్తున్నాయి. మెరుపులకు వల్లకాడులోని పాత పుర్రెలు పాలరాయి ప్రతిమలుగా మెరుస్తున్నాయి.

వర్షంలో శవం తడిసి సరిగ్గా కాలీకాలలేక భూమ్మీద పగసాధిస్తా అన్నట్లు నిప్పుల్లోంచి పైకి లేస్తూంది. వెట్టివాళ్ళు నీ అయస్సు తీరింది అన్నట్లు తమదుడ్డు కర్రలతో బాదుతున్నారు. స్మశాన వాటికకు దగ్గరగా వున్న పట్టాలు మీదనుండి, మెయిల్ తన్నెవరూ, ఆపలేరు అన్నట్లు పోతుంది.

ఆలోచనలలో వున్న రంగయ్యకు మెయిల్ ఒంటి గంటలయ్యింది అని చెప్పిపోయింది.

రంగయ్య శరీరం రక్తముతోనూ వకూ వర్షానికి పలపలబడిపోతుంది. భుజం మీద వున్న రక్తం కక్కుతున్న శవాన్ని మోస్తూ వూగుతూ నడుస్తున్నాడు, మెరుపులకు పాటిదిబ్బ తళుక్కు మంది. ఔను యిదే తన లచ్చిని పూడ్చి పెట్టిన స్థలము దీని ప్రక్కనే ఈ నర్సిగాడిని పూడ్చి పెట్టాలి. భుజం మీదున్న శవాన్ని ప్రక్కకు దింపాడు. ప్రక్కనే వున్న రెండు అస్థికలను తీసుకున్నాడు. వాటితో తన బలాన్ని ఉపయోగించి గోతిని త్రవ్వుతున్నాడు. వర్షం తుంపరలుగా పడుతుంది.

నర్సిగాడి శవాన్ని బలంగా పూడ్చి పెట్టాడు. వర్షానికి ప్రక్కన పిల్ల కాలువలు కడుతున్న నీటితో తన చేతులు కడుక్కొన్నాడు. రంగయ్య చేతులు తన పంచికి తుడుచుకొన్నాడు. వర్షం చాటుమణిగింది, బొడ్డులో నుంచి పొగాకు తీశాడు. వర్షానికి తడిసింది. నాయాల్ది అనుకొన్నాడు కాలిపోయిన శవం కడనిప్పులు యింకా మిణుక్కు, మిణుక్కు, మంటున్నాయి. దీని తస్సాదియ్యా, అని, పుగాకు అరబెట్టాడు. చుట్ట ముట్టించాడు. పొగ వదులుతూ వల్లకాడు దాటాడు. చీకటిలో తారు రోడ్డు నల్లత్రాచులా మెలికలు తిరిగింది. రంగయ్య యాంత్రికంగా నడుస్తున్నాడు. మనస్సు లచ్చి మీదకు పోతూంది.

ఒకనాడు రంగయ్య పాత దుర్గా మహల్లో క్రొత్త సినిమా వచ్చింది గదా! బేరం తగలొచ్చని రిక్షాతో ప్రత్యక్షమయ్యాడు. ఇంకా రెండో ఆట వదలటానికి అయిదు నిమిషాలు పైనుంది. ఖాతా బీడీ కొట్టుకడకు వెళ్ళి, బీడీ ముట్టించి

తాపీగా నాలుగు దమ్ములు లాగాడు. అంతలో బెల్లు మ్రోగింది దీని తస్సా దియ్యా, సినిమా వదిలేశారు అనుకున్నాడు. నోట్లో బీడిని తుపుక్కున వూసి, గూడ కట్టు పైకి ఎగదోసి. తలగుడ్డ చుట్టాడు. హాల్లో జనం బయటకు వస్తున్నారు. రిక్షా బాబూ! రిక్షా! అంటూ కేకలేయసాగాడు. ఎవరో మహానుభావుడు, బేరం ఆడకుండా రిక్షా ఎక్కి వలందపాలెం పోనీయ్ మన్నాడు ఇంత రేత్రికాడ అంత దూరం రాము బాబయ్యా! అన్నాడు దీనముగా రామయ్య నివ్వు సంతోష పెడతాను అన్నాడు. చిన్నగా ఆశ పుట్టింది రంగయ్యకు. తనకు దబ్బంటే ప్రాణం రిక్షా మలుపు త్రిప్పాడు రోడ్డు పరిగెత్తుచున్నట్లు రిక్షా త్రొక్కు తున్నాడు. ఒగవలసిన చోట ప్రయాణికు డిను దింపి వేశాడు. ప్రతి ఫలం ఏమి ముట్టుతుందో అని ఆశగా చూశాడు. రూపాయి చేతిలో పెట్టాడు అతను ఏమిటి దొరా! అన్నాడు.

తీసుకోరా గాడిద, ఇంతకంటే ఎక్కువ ఎవరిస్తారురా అంటూ ఇంట్లోకి దూసుకు పోయాడు.

ఈదెమ్మా అంటూ గొణుక్కు న్నాడు. ఇచ్చిన రూపాయిని మూడు ముళ్లు వేసి పంచెకొంగును బొడ్డులోకి దోపాడు తిరుగు బేరం దొరుకుతుందేమో అని నాలుగు వయిపులు పరికించాడు. లాభం లేదనుకున్నాడు. వచ్చిన దారికి రిక్షా త్రొక్కుకుంటూ పోతున్నాడు, పందిరిలో పెట్టిన పెయ్యి వాట్లు బల్బులా చంద్రుడు ఆకాశములో ప్రకాశిస్తున్నాడు ఆ వెన్నె లకు పచ్చిక బీడులు బృందావన్ గార్డె న్సులా వున్నాయి, చల్లని పిల్లగాలులకు మనస్సు ఆహ్లాదకరముగా యున్నది. రంగడు యాంత్రికముగా, రోడ్డు ఆఫీసు మలుపు తిరిగాడు ఇంతలో ఎవరో-క్యార్ క్యార్ వుంటూ చంటి బిడ్డ ఏడుపు వినిపి స్తుంది, ఏం దబ్బా! ఇంత రేతిరికాడ పిల్ల కూన ఏడుపు వినిపిస్తుంది. అనుకొని రంగయ్య ఎనక్కి ముందుకి తల త్రిప్పి చూశాడు ఎవరూ తగల్లేదు కూము కాడ నుండి మరుకు ఏడుపు వినిపిసుంది. బండిని ఒక్కుదరుగా ఆపి వెళ్ళాడు. నాయాల్ది. ఎంత ఘోరం జరిగింది. నీయమ్మా . పాపం పెరిగిపోయింది అని తిట్టాడు.

అప్పుడే కని పారేసిన సంటి గుడ్డు బొడ్డు ప్రేగును గోటితో గిల్లి అవతల పారేశాడు.

రిక్షాలో దిండు క్రిందనున్న పాత గుడ్డలు తీసి బిడ్డను ఎత్తుకున్నాడు. ఇల్లాంటి బంగారు ఆడకూనను ఎట్టావదలి పెట్ట బుద్దయింది అని రంగయ్య ముద్దు పెట్టుకున్నాడు రిక్షా దిండుపై సంటి గుడ్డును పరుండబెట్టి గూడెంలో తన గుడిశెలోకి వెళ్ళాడు.

రంగయ్య మనస్సు పరిపరి విధము లుగా పోతుంది. ఏందబ్బా' నేనా తాడూ, బొంగరము లేనోడివి. తప్పాదియ్యా! ఈ తూనను చూస్తుంటే వదిలిపెట్ట బుద్ధి అవ డము లేదు. ఆడకూనంటే తనకెంతో యిష్టం యిప్పటికీ కూడా రంగడు బేరంలో వచ్చిన డబ్బులతో అర్థరూపాయి బిళ్ళలుగాని. చక్కెడాలుగాని. కొను క్కొచ్చి చిన్న ఆడకూనలకు పంచి పెడు తుంటాడు. ఏమైనాసరే ఈ ఆడకూన నాకు లచ్చిమిలా దొరికింది అనుకొని రంగడు ఆ నాటినుండి లచ్చి అని పిలవ డము మొదలు పెట్టాడు. లచ్చిని సాక డానికి రంగడు ముత్యాలమ్మను చేర దీశాడు. అ రోజునుండి రంగడు రిక్షాబేరం తో లచ్చిని, ముత్యాలుని, పోషించు తున్నాడు. రంగడు జీవితం సిమెంటు రోడ్డులా సాఫీగా గడచిపోతుంది.

లక్ష్మి పెరిగి, పెద్దదై, పదహారేళ్ళ నిండు యవ్వనవతి అయింది. ఎవరయినా లక్ష్మిని చూస్తే పేరడగకుండా లక్ష్మి అను కుంటారు.

లక్ష్మి రంగడుపై చూపే ఆపేక్షకు అతను ముగ్ధుడై పోతున్నాడు. లచ్చిమి "అయ్యా!' అని పిలిస్తే రంగడు హృద యంలో కోటి వీణలు ధ్వనిస్తాయి. ముత్యా లని అమ్మా అని పిలిచేది, రంగడుసంతో షించే వాడు. విరబూచిన అడవి పూవులా లచ్చిమి ఎప్పుడు హుషారుగా వుంటుంది. గుడెపెల్లో ఎప్పుడూ హుషారుగా చెంగు చెంగున తిరుగుతూ వుండేది. ఒకరోజున లచ్చిమి 'అయ్యా'' దీపాల పండు గొస్తుంది నాకు క్రొత్త పరికిణీ లంగా తేవాలి అని ముద్దుగా అడిగింది. పరికిణీ ఏమిటమ్మా అన్నాడు ప్రేమగా!

ఆయాల మొదలు కొని రంగడు గుడి సెకు దీపాలి పండుగ ప్రొద్దున్నే వచ్చాడు లచ్చిమి, అయ్యను చూడగానే కన్నీరు పెట్టింది. రంగడు! ఏటి, లచ్చీ యీ ఏడుపు అని అడిగాడు అయ్యా! నిన్ను చూడందే ఒక్క రోజు కూడా బ్రతుక లేను ఇన్నాళ్లు ఎక్కడి కెళ్ళావయ్యా అని అడిగింది.

రంగడు గుండె, బావురుమంది. తన లచ్చి కళ్ళు చెమ్మగిల్లడము ఏనాడూ, చూడ లేదు. ఇంకా ఎక్కడికి వెళ్ళనమ్మా, నిన్ను వదలి నేను బ్రతకలేనమ్మా అన్నాడు. లచ్చీ! ఈ రోజు దీపాలపండుగ నీకు క్రొత్త పరికిణీ, లంగా, టపాసులు, చూడు అంటూ చేతిలోని ప్యాకెట్టును లచ్చిమికి అందించాడు. లచ్చిమి ప్యాకెట్టు విప్పి చూపింది. లచ్చిమి కండ్లు ఆనంద ముతో మెరిశాయి. అమ్మో! పట్టు అంచు పరికిణి, గళ్ళలంగా, సినిమాలో ఫ్యాష న్లా జాకెట్టు చూసి మురిసి పోసాగింది. లక్ష్మిని ప్రతిరోజూ అలాగే చూస్తూ వుండి పోవాలనిపించింది రంగడుకు.

గూడెం అంతా దీపావళి మూడుమున

హడావుడిగా వున్నది వున్న వాళ్లు కంచాలు కొద్ది తింటున్నారు. లేని వాళ్ళు పిండి కొద్దీ రొట్టె తింటున్నారు. మంచం కోడి కాళ్ళు చాపుకుంటున్నారు. ఏదైనా ఆ రోజు గూడెం హడావుడిగా వుంది. ముత్యాలు, రంగడకు, లచ్చికి, తలంటింది. లచ్చిమి క్రొత్త బట్టలు కట్టకొని పెండ్లి కూతురలా ముస్తాబయింది. నిజంగా నా లచ్చిమి యేనా అనిపించింది రంగడకు. ముత్యాలు వండిన గారెలు, లచ్చిమి. రంగడూ, తిన్నారు. రిక్షా బండికి పసుపు రాసి, కుంకుం బొట్లు పెట్టింది లచ్చిమి. రంగడు ఆశ్చర్యపోయాడు. ఏ జన్మలోనో తన కూతురే ఈ లచ్చిమి అనుకున్నాడు రంగడు.

ఆప్యాయముగా! లచ్చిమిని పిలిచి తల నిమిరాడు. ఇంతలో సూరిగాడు వచ్చి రంగడను పిలిచాడు.

ఏరా! రంగడూ! ఏంది ఇక్కడ కూసున్నావు. జమ్మి చెట్టు కడికోడి పంజాలు మా సోగ్గా సాగుతున్నాయట్టా, ఈ మాట యనకో, కరణంగారి దేగోడిందంట. నాయాల్ది. ఈయాల దానిరుణం తీరింది రారా రంగన్నా అన్నాడు. రంగడు భుజం మీద తువ్వాలు వేసకొని, బనీను జేబులో చెయ్యెట్టాడు. ఆయిదు రూపాయలు,మూడు ఎస్. బీడీలు తగిలి, పావలా బిళ్ళ జేబు చివర కొసలో యిరుక్కుంది. కస్సాండయ్యా ఆయితే ఎళదాం పదరా సూరిగా అన్నాడు. ఇదరు కలసి దారి తీసారు. అరే, రంగడూ సుబ్బారు దగ్గర మంచి నాటుందంట, ఎల్లా మేటి అన్నాడు. నాయాల్ది, ఈయాల పండుగ రోజున ఎల్లకపోతే ఇంకెప్పుడు. ఎల్తాంరా సూరిగా అన్నాడు రంగడు.

సుబ్బాడు కొట్టనిండా జనం ఉన్నారు సీకులు మా జోరుగా కాలుస్తున్నారు. ఆ వాసన గుమ, గమ కొడ్తుంది. అరే సూరిగా మా దావ్మర్ది నర్సిగాడు ఇక్కడే వున్నాడురా అన్నాడు.

నీ బావమర్ది ఎవరసే అన్నాడు చిరాగ్గా సూరిగాడు. ఆదేరా ముత్యాలు తమ్ముడు. అరేరే క్రిందటి దీపాల పండక్కి నాయాలు గుంటలా వుండేవాడు. నాయాల్ది అప్పుడే గ్లాసు కొడ్తున్నాడు అన్నాడు సూరిగాడు. ఇంతలో నర్సిగాడే పలుకరించాడు, బావోయ్! నర్సిగా, నీ అక్క రమ్మందిరా! గుడిశెకు. గారెలు వండి నీ కట్టి బెట్టింది అన్నాడు. నా సామిరంగా? గారెలు అంటే నా కిట్టమని మా అప్పకు తెలుసు బావా! అందుకే నాకు అట్టి బెట్టింది అన్నాడు నర్సిగాడు. సుబ్బాడు చేతిలో అయిదు కాగితం వుంచి, రంగడకు రెండున్నర నాటుపోయించి. మిగతా రెండున్నరకు నర్సిగాడు గ్లాసు కొట్టేడు ఏం బావా, నేను ముత్యాలప్ప దెగ్గిరికి వెల్తున్నాను. నీవు పంజానికి ఎల్లు. అన్నట్లు మునసబుగారి నెమలి కూడా ఓడిందంట, నాయాళ్ళ రుణం తీరింది అని చెప్పి బయలుదేరాడు.

దీపావళి మూలమున, నర్సిగాడు గ్లాసుకో పంచి, లాల్చీ వేసాడు. పచ్చని లాల్చీలోనుండి మెలి తిరిగిన కండలు కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి. త్రాగిన మైకంలో తూలుతూ నడుస్తున్నాడు బూతు పదాలుతో, కూనిరాగలు మార్చి పాడుతున్నాడు. గుడిసె దగ్గరకు వెళ్ళి తలుపు తట్టాడు లచ్చి తలుపు తీసింది నర్సిగాడు ఒక్కసారిగా ఆశ్చర్యపోయాడు. తిరునాళ్ళ కెళ్ళినపుడు. సినిమాలో చూసిన సావిత్రిలా వుంది లచ్చిమి. నన్న! నా అప్పేది అని అడిగాడు ప్రక్క గూడెంకు వెళ్ళింది అని సమాధానం యిచ్చింది. నా సామిరంగా! అయితే నువ్వొక్క దానివే వున్న మాట అన్నాడు. లక్ష్మి వణుకుతుంది. లక్ష్మి తలలో పెట్టిన వాసనను, నర్సిగాడి నాటుసారా వాసన మింగేసింది. గుడిసెకున్న ఒకే తలుపును కాలితో అడిమి పెట్టి గడి వేశాడు. లచ్చిమి భయంతో కంపించి పోతుంది. లచ్చిమి చేయి బట్టుకున్నాడు నర్సిగాడు.

అయ్యోయ్, అని అరచింది. అరవకే లచ్చి రేపు పుస్తెకట్టే మొగుడును నేనే కదటే, నా దగ్గర నీకు జంకేమిటి అన్నాడు నర్సిగాడు మాట్లాడుతుంటే నాటు వాసన కొట్టి లచ్చిమి తల సొగిలి పోతుంది. మోటైన నర్సిగాడి చేతులో సుకుమార మైనటువంటి లచ్చిమిని రబ్బరు బొమ్మలా నొక్కేస్తున్నాడు. లచ్చిమి స్పృహతప్పిపోయింది. నర్సిగాడు ఆ సమయములో అంబోతులా ప్రవర్తించాడు. గబ గబా మట్టికుండలో నుండి చల్లనినీళ్ళు లచ్చి మొహాన కొట్టాడు తెప్పరిల్లింది లక్ష్మి. వెక్కి వెక్కి ఏడుస్తున్న లక్ష్మిని ఏడవకు అని ధైర్యం చెప్పి బయటకు పోయాడు. త్రాగిన మైకంలో నుంచి నర్సిగాడు తేరుకున్నాడు. చేసిన పనిని గురించి బావ రంగడును, తలచుకొని బేజారెత్తి పోయాడు. ఇంకేముంది బావ చంపేస్తాడనుకున్నాడు, అబద్ధమాడి తప్పించుకో వాలని గుండెకు ధైర్యం చెప్పాడు.

లచ్చిమి వొళ్ళంతా హూనమైపోయింది బుగ్గల మీద పడ్డ గాటులకు రక్తం చిందుతుంది. అయ్య తెచ్చిన పరికిణి, లంగా-జాకెట్టు, చింకినట్లు చిరిగిపోయాయి. ఏడ్చి ఏడ్చి లక్ష్మికి కళ్ళు పుసిరికాయల్లా ఉబ్బినాయి. ఇంతలో ముత్యాలు ప్రక్క గూడెం నుండి తిరిగివచ్చింది. ఆ అవతారంలో వున్న లక్ష్మిని చూడగానే ముత్యాలు గుండె బావురుమంది, ఏటి లచ్చి! ఏమి జరిగింది? అని అడిగింది

'చెప్పడానికి నోరు రావడములేదమ్మా! నా బ్రతుకు అన్యాయమైపోయింది,' అంటూ వెక్కి వెక్కి ఏడుస్తుంది.

ఏడుస్తున్న లచ్చిమిని ఓదార్చి అసలు విషయం తెలుసుకుంది ముత్యాలు. అమ్మో! ఈ విషయం రంగడికి తెలియనీయకూడదని లచ్చిమితో చెప్పింది. ఏడుస్తున్న లచ్చిని ఓదార్చి, ఆమె ఎవడను

కన్నావే నా తమ్ముడు. నీకు కాబోయే మొగుడు. ఏడవకు, ఆడికిచ్చి పెండ్లి చేయించుతాను. అంది ముత్యాలు.

రంగడు కోడిపందెములు నుండి తిరిగి వచ్చాడు. రంగడు కాస్త నిషాలో వున్నాడు. ముత్యాలు ఇదే సమయమను కొని పెండ్లి ప్రస్తావన ఎత్తింది.

ఏవయ్యా! నీకేమీ పట్టదు. లచ్చి పెరిగి పెద్దదయింది. ఏ వయస్సులో జర గాల్సింది ఆ వయస్సులో జరగాలి. అంది ముత్యాలు.

ఏంటసే నీ గోల. నువ్వెళ్ళు, అన్నాడు.

అసలు నువ్వొక్కత్తి మొద్దు మనిషివి. నిన్ను కట్టుకోవటము నాదే బుద్ధితక్కువ, అన్నది ముత్యాలు.

'ఏటి, ముత్యాలు! యింతకూ నువ్వ నేది లచ్చి పెళ్ళేగా! దానికి పెళ్ళి జేస్తే నేను బతకను. దానిని చూడందే నేనుండ లేను ఏటంటే, అది నా ప్రాణం. నా గడప దాటిందంటే నే నుండలేను, కనుక నీవు రెండేళ్ళు దాకా, దాని పెళ్ళి వూసె త్తావా పళ్ళూడగొడ్తాను, అన్నాడు రంగడు.

అయితే నిన్ను వదలి పెట్టేస్తాను అంది ముత్యాలు. నా మాట వినవోడివి నీ దగ్గరెందకుంటాను? ఏ జన్మలో ఏ పాపం చేశానో, ఇప్పుడు ఈ బుద్ధితక్కు వోడు నన్ను కట్టుకున్నాడు దేవుడో అంటూ శోకాలు మొదలుపెట్టింది.

దీని నోటికి ఇంతకాలం నుండి దురుసుమాటలు రాలేదు. ఈయాల ఏటి యిట్టా మాట్లాడుతుంది అని అరకమీ దున్న దుడ్డుకర్ర పుచ్చుకొనిచితకపొడ్చాడు రంగడు మనస్సు బాగోక కల్లుకొట్టుకాడకు వెళ్ళాడు ఇంతలో ముత్యాలు మూటా ముల్లూ సర్దుకొని తమ్ముడు నర్సిగాడింటికి పాలెం పోయింది యింతలో రంగడు గుడినుండి తిరిగివచ్చాడు

లచ్చి వెక్కి వెక్కి ఏడుస్తూ అయ్యా! ముత్యాలమ్మ మూటాముల్లు తీసుకొని వెళ్ళింది, అంది

లచ్చీ! ఊరుకోమ్మా అది పోతే నీ కెందుకు ఏడుపు? నేనుండగా! అసలు, అదొట్టి గొడ్డుమోతుముండ, దాన్ని కట్టు కోవడం నాదే బుద్ధితక్కువ, అనిలచ్చిమిని సముదాయించాడు లచ్చిని కూడెట్ట మన్నాడు

లచ్చి అయ్యకు కూడెట్టి, తను కూడా కూడెట్టుకుంది

ఏదిఏమైనా అన్నం సహించలేదు వాళ్ళిద్దరకూ, ముత్యాలు లేకుండా ఏ రోజూ, ముద్ద నోట్లో పెట్టలేదు. లచ్చి మరీ వెక్కి వెక్కి ఏడ్చింది.

ఊరుకోమ్మా! అది ఏడకుపోతాది? రేపు యిట్టా తిరిగిరాదు, అన్నాడు రంగడు. రంగడుకు కూడా బాధ కలిగింది తను కట్టుకొని ఈనాటికి పద్దెనిమిదిఏళ్లు నిండినాయి ప్రాణం ఉస్సూరుమంది. వెళ్ళి పిలుద్దామనుకున్నాడు అసలు తప్పేమీ లేకుండా వెళ్ళింది దాన్నేటి పిలిచేది అనుకున్నాడు చితకకొట్టాననుకో! ఇది కొత్త కాదుగా. మామూలేగా అనుకున్నాడు రంగడు మనస్సులో పోనీయ్ ఎవరి ఖర్మ వారిది అని ఊరుకున్నాడు రంగడు,

రోజులు రంగడి రిక్షాబండి చక్రాల్లా తిరిగిపోతున్నాయి.

ఒకరోజున రంగడు లచ్చిని పిల్చి, ఏమ్మా! ఈయాల్టికి ముత్యాలు వెళ్ళి ఎన్ని రోజులు? అన్నాడు రంగడు.

మూణ్ణెల్లు అంది లచ్చిమి,

అదొట్టి మంకుముండమ్మా! రేవెళ్ళి మీ అమ్మను పిలుకొత్తాను అన్నాడు రంగడు.

లచ్చి చాలా సంతోషించింది. అయ్యా బావికడకు నీళ్ళకు ఎల్తున్నాను. నువ్వు పడుకోమంది.

జాగ్రత్తమ్మా! గూడెంవాళ్ళతో వెళ్లు. ఒక్కతివే వెళ్ళకు అన్నాడు.

అట్టాగే అయ్యా! అని కుండ తీసుకొని వెళ్ళిపోయింది.

లచ్చి వెళ్ళగానే రంగడు ఆలోచనలో పడ్డాడు. ముత్యాలును ఎల్లాగైనా పిలుచుకు రావాలి. అన్యాయముగా నా లచ్చి కష్టపడ్తూంటే చూడలేను. నా లచ్చికి ఎన్ని బాధలు వచ్చాయి. ముత్యాలు వెళ్లిన కడనుండి యింటిపనంతా లచ్చికే పట్టింది. రేపెల్లాగైనా ముత్యాలును తీసుకొస్తాను. అని ఆలోచిస్తూ నులకమంచం మీద కునుకు తీశాడు సరిగ్గా ఒక్క కునుకు పట్టిందో లేదో సూరమ్మ పరుగెత్తుకుంటూ వచ్చి లేపింది.

రంగడూ! రంగడూ! లచ్చి మాటామంతీ లేకుండా బావికడ పడిపోయింది, అని చెప్పింది.

రంగడికి పై ప్రాణాలు పైనే పోయినంత పనైంది. వెంటనే చిన్నపాటి పరుగు లంకించుకున్నాడు గుండె దడదడ లాడుతోంది, ఊరి పోలేరమ్మను మొక్కుకున్నాడు. నా లచ్చిని కాపాడమన్నాడు గుంపులోంచి దీసుకొని వెళ్ళి లచ్చిని భుజాన వేసుకొని గుడిశెకు తీసుకొచ్చి నులకమంచం మీద పడుకో

బెట్టాడు. సూరగాడితో, ఆచారి డాక్టరు గారికి కబురు పంపించాడు. ఆచారి వెంటనే వచ్చారు. గుడిశెలో వున్న జనాన్ని అందర్నీ బయటకు పొమ్మన్నాడు నాడీ పరీక్షచేసి, ముఖాన నీళ్ళు కొట్టాడు

లచ్చి తెప్పరిల్లింది. భయం భయంగా అయ్యకేసి చూసింది. రంగడు బావురుమన్నాడు.

ఆచారి రంగడిని దొడ్డివైపుకు తీసుకెళ్ళాడు.

ఏమైంది నా లచ్చికి? ఆచారిగారూ! అని అడిగాడు.

ఆచారి చెప్పలేక నీ లచ్చి గర్భవతి అన్నాడు.

రంగడు అరటిమొదలులా కూలిపోయాడు. అయ్యో! గంగానమ్మతల్లీ! నన్నెంత అన్యాయం చేశావు బంగారం లాటి నా లచ్చికి ఏమిటీ ఖర్మ? నేను ఇది చూడ్డానికేనా నేను బ్రతికున్నది? కూటికీ, కులానికి పేదనైనా. నాకన్న, నీతినిజాయతీలలో గొప్పవాణ్నే నా గూడెమంతా ఏమైంది నీ లచ్చికి అంటే ఏమి చెప్పను? అంటూ రంగడు కమిలిపోయాడు.

లచ్చిమి నీళ్ళోసుకుందని ఊరంతా అట్టుడికినట్టు ఉడికిపోయింది. రంగడు ముద్దమింగి మూడు రోజు లయింది.

అయ్యో! బువ్వ తిను అంటూ రంగడు చేతులు పట్టుకుంది.

ఈ పని చేసిందెవరే అంటూ జీర బోయిన గొంతుతో అడిగాడు.

నర్సిగాడని తెలుసుకుని, అరేయ్! నర్సీ!—'' అంటూ పిచ్చిగా గర్జించాడు. ఛీ! పాపిష్టిదానా! ఆ బ్రతుకు బ్రతికేకంటే శుభ్రంగా ఏ బావిలోనన్నా పడి చావు! అసలు నేనే తప్పుపని చేశానే! ఆ రోజు సంటిగుడ్డుగా నున్నప్పుడే, నీ పీకనులిమి అవతల పారెయ్యలేకపోయానే దేవుడా! అంటూ రంగడు కమిలి ఏడుస్తున్నాడు.

లచ్చిమి మూడు రోజులు కూడూ, నీళ్ళూ లేకుండా, శవంలా నులకమంచం మీద పడివుంది. రంగడు కూడా అలానే ఉన్నాడు,

రంగడులో ఆవేశం పెరిగింది. రక్తం పొంగి శగలు కక్కింది. ఎముకలు పటక్, పటక్ మంటూ విరచి పళ్ళు కటకటా నూరాడు. రంగడు వెర్రిగా యిలా వాగాడు కూటికి, కులానికి నేను పేదనమ్మా! నీతి, నిజాయితీలు అనేవి నా బ్రతుకమ్మ అవి లేని నేను బ్రతికను అవి లేకుండా చేసినవాణ్ణి బ్రతకనివ్వను, అంటూ ఆవేశంతో లేచాడు నరాల్లో పట్టుతప్పి రంగడు క్రింద పడ్డాడు

లచ్చి అలానే నిలబడి రంగడు ముఖాన నీళ్ళు కొట్టింది.

లచ్చిని చూడగానే రంగడు ఏవగించుకున్నాడు కసురుకున్నాడు. నా ముందు నుంచి పొమ్మని కసురుకున్నాడు.

రంగడు అలానే లేచి శక్తిగుడిరోడ్డు వైపుకు దారి తీశాడు. శక్తిగుడి కాడ దాసు గారు హరికథ చెబుతున్నారు. సత్తువలేని కాళ్ళు రంగడిని యాంత్రికముగా కూర్చో బెట్టాయి.

దాసులువారు హరికథలో ఇలా చెప్పారు సీతాదేవి అరణ్యంలో నా వాళ్లు అనే కనీసం దిక్కు లేకుండాపోయింది చివరికి పాడిచ్చే గోవుకి, కుడితితొట్టె, కట్టెబండి ఈ రెండు నా వాళ్ళు అనే ధైర్యంతో బ్రతుకుతాయి, చివరికి ఆ మహాసాధ్వి సీతాదేవి కనీసము ధైర్యం లేకుండా కష్టాలను గట్టెక్కింది అని చెప్పాడు.

ఈ మాటలు విన్న రంగడుకు, ఎందు వలనో దాసులుగారికి చెయ్యెత్తి నమస్కారం పెట్టాడు. సత్తువలేని కాళ్ళకు సత్తు వచ్చినట్లు అయింది. దాసుగారు ఆ సమయంలో దేవుడిలా కనిపించాడు. నా లచ్చిమికి ఒక దారి చూపించాడను కున్నాడు. అయితే నర్సిగాడికిచ్చి లచ్చిని పెండ్లి చెయ్యాలి. అప్పుడు నా లచ్చి సుఖపడుతుంది. అమ్మా! లచ్మీ! నిన్ను ఎన్ని తిట్టానమ్మా! నిన్ను ఎంత ఈసడించానమ్మా! నా బంగారుతల్లి! నీవు మట్టిలో మాణిక్యానివమ్మా! నీ శీలాన్ని బలవంతంగా పాడుచేసిన నర్సిగాడికి, నీ ఉసురు తగలుతుందమ్మా! నన్ను క్షమించమ్మా! అంటూ, ఈగల్లా ముసురు కుంటున్న ఆలోచనలను, ఓపికలేని దగ్గు తుఫాను, రక్తమనే వరదతో ముంచింది. కాస్త తెప్పరిల్లిన రంగడు దగ్గరకు, సూరి గాడు లాంతరు పుచ్చుకొని పరిగెత్తు కుంటూ వచ్చాడు.

రంగడూ! రంగడూ! నీ యిల్లు తగల బడి పోతోంది లచ్చికూడా దానిలోనే వుంది, అన్నాడు.

రంగడు పాండురంగవిగ్రహంలా స్థంభించిపోయాడు. రేసుగుఱ్ఱంలా పరిగుత్తాడు పూర్తిగా తగలబడిపోయిన గుడిశెను చూసి బావురుమన్నాడు. అప్పటికే, లచ్చిమి భోగిమంటలో ఊతబొందులా కాలిపోయింది. అల్లాంటి లచ్చిమిని చూచి రంగడు గుండెలు పగలుకొట్టు కున్నాడు. అసలు ఏం జరిగింది నా లచ్చికి? అంటూ విస్తుపోయాడు.

సూరిగాడు ఇట్టా అన్నాడు మీ బావ్మొర్ది నీ ముత్యాలుతో యిట్టా అన్నాడంట! ఏమో? లచ్చి ఎవతో? అదెవతో, దానికి నాకు సంబంధము లేదు. దాని ఒంటి మీద ఏనాడూ చెయ్యి ఏయిలేదు. ఆదొట్టి బజారుది. అభం శుభం ఎరగని నా మీదకు తోసింది అన్నాడంట.'

ముత్యాలు వచ్చి అనరాని మాటల్తో నీ లచ్చిని తిట్టి వెళ్ళింది

ఈ మాటలు విన్న రంగడు ఆవేశంతో గుండెలు చీల్చుకుంటూ పిచ్చి

ఎక్కినవాడిలా ఒక్కసారిగా వికటాట్ట హాసము చేశాడు ఒరేయ్, నర్సిగా! బలి, బలి నిన్ను నా లచ్చికి ఊరి పోలేరమ్మకు యాటను బలిచ్చినట్లు ఇస్తారా! అంటూ వెర్రిగా వాగాడు. కాలిపోయిన లచ్చిని చూసి బావురుమంటూ అలాగే చేతుల్లో పెట్టుకొని వల్లకాడులో పాటిదిబ్బ మీద పాతేసి వచ్చాడు.

రాత్రి తొమ్మిదైంది. రంగడు ఆవేశంలో వగరుస్తున్న ఎలుగుబంటిలా ఉన్నాడు గొయ్యి తీసిన మట్టిచేతులు కడగనైనా లేదు. పది గంటలకల్లా గుడిసెకు జేరాడు. సూరిగాడింటి అటకపైనున్న బోతాకత్తి కోసం వెతికాడు. ఎన్నాళ్ళనుంచో స్థిరనివాస మేర్పరచుకున్న బోతాకత్తిని రంగడు స్వాధీనం చేసుకున్నాడు చేతికి వున్న తడిమట్టితో కత్తి మొదలు గీకి పదును పెట్టాడు. ఆకాశంలో బోతాకత్తి రంగులా మబ్బు పట్టింది కత్తికి గుడ్డలు చుట్టి, కాలిపోతున్న గుడిశెలో నుంచి తీసుకొచ్చి దాసిన రంగడు రిక్షాబండిలో పెట్టాడు. రిక్షా ఎక్కి సూరిగాడింటి వాకిలి దాటాడు. గాలికి బండి కదలటంలేదు నరాలన్నీ బయటకు కనబడేడట్లు పాలెం వైపుకు బండిని త్రొక్కుతున్నాడు. జోరున కురుస్తున్న వర్షానికి రంగడు యంత్రములా ఏగిపికిపోయి బండి త్రొక్కుతున్నాడు. త్రొక్కుతున్న బండి ఒక్కసారిగా బోల్తా పడి, బోత్రాకత్తి నెత్తిమీద పడి రక్తం చిందుతుంది. కారుతున్న రక్తం కళ్ళలో నుండి క్రిందకు జారుతుంది. కళ్ళు బోతకత్తి కనిపించక, చేతులకు ఆజ్ఞ నిచ్చాయి చేతులకు అడ్డంగా బండి తగుల్తుంది అడ్డమువున్న బండిని ఒక్క తోపు తోశాడు. బండి నా అధ్యాయం పూర్తి అయింది అన్నట్టు కాలువలో పడి మునిగిపోయింది. తొడక్రింద వొత్తుకుంటున్న బోతాకత్తిని చూచి ఆనందించి ముద్దు పెట్టుకున్నాడు. కత్తి, చేతిని ఆయస్కాంతములా గట్టిగా పట్టుకుంది ఫర్లాంగ దూరంలో వున్న పాలెంకు, యమధర్మరాజులా పరుగెత్తి నర్సిగాడింటికి వెళ్ళాడు. నర్సిగాడు దుప్పటి కప్పకొని ప్రశాంతముగా పడుకున్నాడు, బోతాకత్తితో పీక మీద ఒక్క వ్రేటు వేశాడు. పిడుగు పడే శబ్దంతో నర్సిగాడి అమ్మో! అన్న కేక కలిసిపోయింది. సగం తెగిన తల, మొండాన్ని ఆశగా వ్రేలాడుతుంది, నర్సిగాడి శవాన్ని పాటిమీద లచ్చిదిబ్బ ప్రక్కన దిబ్బేశాడు.

రంగడు ఆలోచనల్లో తేరుకొని చుట్ట పీక ఆఖరిదమ్ము లాగి చెయ్యి చురుక్కుమంటే అవతల పారేశాడు చీకటిలో ఎదురుగుండా వస్తున్న హెడ్‌లైట్సులాంటి ఆను యమధర్మరాజు చేతుల్లో నుండి తప్పించుకోలేకపోయాడు, లచ్చీ! అన్న కేకతో లచ్చి దగ్గరకు జేరాడు రంగడు.

ఉదయభాస్కరుండు ప్రశాంతంగా శుభోదయం గావించాడు.

# అంతు తెలియని మానవుడు

తెగని సమస్యల్లో ఒక మానవుడు అటూ-ఇటూ చూడకుండా పరిగెడుతున్నాడు.

ఆగు' అన్నారెవరో వెనకనించి.

వెనక్కి ఆగి చూసేడు ఎవరూ లేరు

'నీ ముందున్నాను '

శబ్దం వెనకనించి, ఆకారం ముందు

'ఎవరు నువ్వు'

'నీ నీడని!

'మరి ఇదేమిటి?'

'కాంతి కన్నా వేగంగా పరిగెట్టే కిరణాలున్నాయి తెలుసా?'

మానవుడికి దిక్కు తోచక వెనక్కి నడవడం మొదలెట్టేడు.

# సైన్స్ గ్రాడ్యుయేట్ ఎల్‌డీసీ

అరగంట ఆలస్యంగా వచ్చిన సైన్స్ గ్రాడ్యుయేట్ ఎల్డీసీని అఫీసర్ సంజాయిషీ అడిగాడు -

'నే నెంత లేటు సార్?

'అరగంట!

'మీకు అరగంట—నాకు అర సెకను కానొచ్చు సార్!'

అదేం వా సప్యా?' అని మండిపోయాడు ఆఫీసర్

'మీరు ఆఫీసులో వున్నారు. నేను శూన్యంలో వున్నాను స్పేస్ అండ్ టైం సార్!' అన్నాడు సైంటిస్టు

'అంతే అ శూన్యంలోకే వెళ్ళవయ్యా!' గొంతు చించుకున్నాడు ఆఫీసరు

'దానికి అర్థం లేదండీ!

'మరి, పనో తగలడండి!'

'సరేనండి! సైన్సు గ్రాడ్యుయేటు ఎల్డీసీ చెక్కులు రాసే సీటులో కెళ్ళాడు

# ఆటంతో చెలగాటం

మానవుడు మేధస్సంతా వెచ్చించి 'ఆటం ని గుప్పిట్లో పెట్టుకుని 'హాహాహా' అని గర్వంగా నవ్వాడు.

ఆటం' (Atom) అతని గుప్పిట్లోనే వుండి 'హ్హ..హ్హ.హ్హ ' అని వికటాట్టహాసం చేసింది.

—సుబ్బన్న.

# తారల శిఖరాలు

విశాఖ పట్నంలో అఖిల భారత మహా రచయితల నాలుగవసభ జరుగుతోంది ఆ సందర్భంగా నేను అక్కడకు వెళ్లాను వెళ్ళిన మర్నాడే సుదర్శనంగారు పోయి నట్టుగా పిడుగువాటులా ట్రంక్ కాల్ వచ్చింది అప్పటి కప్పుడు బయలుదేరి వచ్చేసాను.

నేను వెళ్లేముందు కూడా ఆయన నాతో బాగా మాట్లాడారు. వూరు వెళుతు న్నప్పుడు ఆయన నాకు చేసిన హెచ్చరి కకే ఆఖరి అప్పగింతలు అయినాయి. నేను వచ్చేసరికే యింటికాడా బంధువులు, తెలి సినవాళ్ళు ఎవరెవరో వచ్చి వున్నారు

కర్మకాండలన్నీ భాస్కరం చేతి మీదుగానే జరిగినాయి. ఆ పది రోజుల్లో మా పత్రికని గురించి చాలా రకాలుగా తర్జన భర్జనలు జరిగినాయి. వచ్చిన వాళ్ళలో చాలామంది పత్రికని అమ్మేసి, ఆ బాదర బందీ వదిలేసుకోమని సలహా యివ్వ సాగారు. యీ మాటలు వింటున్న నాకు మనసులోనే వవనాడులూ క్రుంగినట్టు ఫీలయ్యాను. ప్రెస్‌లోకి వస్తే వర్కర్స్ అంతా నా వైపు ప్రశ్నార్థకంగా చూడ సాగారు. అక్కడికీ ఒకళ్ళిద్దరు అనేసారు. యిన్ని సంవత్సరాలనుంచి దీన్ని నమ్ము కుని బతికాం. ఇప్పుడు ఎక్కడికి పోవాలి బాబూ! మా కెవరు యిస్తారు వుద్యోగం? సత్తువంతా దీనికి ధారపోసిన మమ్మల్ని ఎవరు దగ్గరికి దీస్తారు?" ఆ కళ్ళలో భయం, నిస్పృహ నాకు నిద్ర పట్టకుండా వెంటాడసాగినాయి.

ఆ సాయంత్రం సుభద్రమ్మ గారింట్లోకి కావాల్సిన డబ్బు తెచ్చి యిచ్చి వెళుతున్న నేను సత్య కూర్చోమనడంతో ఆగిపో యాను.

"పత్రిక అమ్మేయమని అత్తయ్యని నేనూ బలవంతం చేస్తున్నాను" అంది.

"సత్యా!" దిమ్మెరపోయినట్టు చూసాను

పత్రికని అమ్మకుండా వుంచాలనే నా యీ ప్రయత్నంలో - సత్య నాకు అండగా వుంటుందనే నా గుడ్డి నమ్మకం భ్రమ అని తెలిసిన ఆ క్షణంలో ఎందుకో కాని నేను నమ్మకం వమ్మయిన మనిషిలా తికమక పడ్డాను.

సత్య అందకి చూస్తూ అంది.

"అవును! యీ పత్రిక చేతిలో వుంటే అత్తయ్యకి చాలా గొడవలు ఎదురవుతాయి మొదటిది. ముఖ్యంగా ఖాస్కారం

ఏం చెప్పగలను నేను! సత్య కళ్లెదుట కనిపిస్తున్న మా ఆదర్శ శిఖరన్ని ఎక్కవద్దని వెనక్కు తిరగమని అనటానికి నేనెవర్ని? నాకేం అధికారం వుంది!

నాలో హఠాత్తుగా వుత్సాహం నశించింది. నాకెన్నడూ ఎరగని నిస్పృహ ఆవరించింది,

నా కళ్ళలో కనిపిస్తున్న నిరాశకి సత్య వేరే అర్థం వూహించినట్టుంది.

# యద్దనపూడి సులోచనారాణి

ఆవిడని బజారుకు లాగుతాడు. ఈ స్థితిలో ఆవిడ మనశ్శాంతిగా కృష్ణా, రామా అనుకోకుండా వ్యధ పడటం నా కిష్టం లేదు. పత్రిక అమ్మగా వచ్చిన డబ్బుతో బావ పేరిట నర్సింగ్ హోమ్ తెరుస్తాను. మా యిద్దరి శేషజీవితాలూ దానికి అంకితం చేయాలనుకుంటున్నాం."

నేను ఒకసారి అప్రయత్నంగా కళ్లెత్తి సత్య వైపు చూసాను. సత్య దృష్టులు శూన్యంలో చక్కడి వున్నాయి. అక్కడి ఏదో కాంతిని వర్ణిస్తున్నట్టుగా ఆమె ముఖం దీప్తివంతంగా వుంది.

"మీ విషయం అత్తయ్య మర్చిపోలేదు. ఎడిటర్‌గా మీ బాధ్యత మరిచి మీరు షదనీభ్యులుకారు ఎందుకంటే పత్రిక కొనబోయేది ఎవరో కాదు. మన శాంతి!

వులిక్కిపడ్డాను నేను. శాంత యీ పత్రిక కొంటోందా? సత్య మళ్ళీ అంది.

"మీకు జీతం ఎక్కువ యిస్తుందిట. పత్రిక మీద యింకా డబ్బు ఖర్చుపెట్టి అభివృద్ధి చేస్తుందిట. పత్రిక ఆఫీసు అక్కడ మంచి మార్పించి యిక్కడెక్కడయినా మంచి స్థలంలో తీసుకోటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి."

నేను నిర్విణ్ణుడయినట్టు చూసాను. వాలో హటాత్తుగా ఆగ్రహంలాటివి వచ్చింది. లేచి నిలబడుతూ అనేసాను.

'థాంక్స్! సుభద్రమ్మగారు యాజమాన్యంలో లేనప్పుడు యిందులో పని చేయటం నా అభిమతం కానేకాదు. ఈ సంగతి అత్తయ్యతో మీరు చెప్పండి పత్రిక ఆవిడ చేతినుండి మారిన తర్వాత ఎవరయిందీ నాకవసరం లేదు. మీరు పత్రిక ఎప్పుడు అమ్మేస్తున్నారో చెప్పేస్తే అంతకు ముందే మీకు నా రాజీనామా కాగితం అందచేస్తాను అని అంటున్నానని కూడా చెప్పండి. వస్తాను శలవు' గబ గబా అనేసి బయటకి వచ్చేసాను.

నాకేమిటో వూపిరాడనట్టుగా వుంది. నేనెలాగయినా సుభద్రమ్మగారిని ఒప్పిస్తానని, వాళ్ళ వుద్యోగాలకి ముప్పేం రాదని ఆవిడకి నచ్చచెప్పిస్తానని గంపెడాశతో ఎదురు చూస్తున్న ఆ అమాయకులకినేనేం చెప్పను! శాంత కొంటుందా పత్రికని? అయిగ నన్ను తన వుచ్చుల్లోకి లాగాలని శాంత చేస్తున్న ప్రయత్న మన్నమాట! బాగుంది!

మర్నాడు సుభద్రమ్మగారు నా కోసం కబురు చేసారు.

ఆవిడ కూర్చున్న గదిలో అడుగు పెడుతున్న నేను ఆవిడని చూడగావే క్షణంసేపు చకితుడయినట్టు ఆగిపోయాను. ఈ 15 రోజుల్లో ఆవిడలో ఎంత మార్పు! అకాలవార్ధక్యం చేసిన మనిషిలా వుంది. ఈ తరం యువతులంతా బొట్టు ఒకఅలంకారం మాత్రమే నంటారు, నేను కూడా అలాగే భావిస్తూ వచ్చాను. కాని ఆవిడను చూస్తే అలా అనిపించటం లేదు. ఆ బొట్టు ఒక్కటే ఆవిడ జీవశోభ అనిపించేట్టు కళకళలాడుతూ వుండేది! సుదర్శనంగారితోపాటు ఆవిడ శోభ అంతరించినట్టుగా కళ మాసినట్టుగా వుంది ఆవిడ ముఖం. నాకర్థమైంది. ఇదివరకు వాళ్ళు అది ఒక పవిత్రమైన చిహ్నంగా భావించేవాళ్ళు. యిప్పటివాళ్ళు అలంకారంగా మాత్రమే ధరిస్తున్నారు. భర్త విహీన అయిన ఆధునిక యువతి ముఖం బొట్టు తీసినంత మాత్రాన యింత కళావిహీనం అవుతుందని నేననుకోను యిదంతా ఆ భావనలో వుందా?

"రా రవీ! కూర్చో." అన్నాడు.

ఆవిడ ముఖం ఎలాటి భావం లేకుండా నిర్మలంగా వుంది. మనసులో సదా మాలిన్యం ఏర్పరిచే రాగద్వేషాలని మృత్యువు అనే మహా నిర్మలమైన జలంలో ప్రక్షాళనం పొందిన మనిషిలా వున్న రావిడ.

నేను నిశబ్దంగా ఆవిడ కెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాను. విరాలా వున్న యీవిడ ముందు నేను చూపుదామని

వచ్చిన ఆవేశం, తర్కం హాస్యాన్ని దంగా వుంటుందనే భయంతో అవి మెల్లగా నానుండి జారిపోసాగినాయి।

ఎలాటి ఉపోద్ఘాతం లేకుండా ఆవిడ అన్నారు.

రవీ, ఈ వయసులో ఎక్కువ బాధ్య తలు పెట్టుకోవటం అనేది నా అభిమతం కాదు. శాంత యీ పత్రికని కొనటానికి అభిలాష పడుతుంది! డబ్బుగల శాంత యింకా దీన్ని మెరుగులు దిద్దగలదనే విశ్వాసం నాకుంది. పత్రిక బాగా నడవటం కంటే మించిన ఆత్మశాంతి ఆయనకి యింకేం వుందని నాకు తెలుసు. కాని–"

తర్వాత ఆవిడ నోటి వెంబడిరాబోయే మాటలకి నేను నిశబ్దంగా, అణువణువూ బిగబట్టి వేచి చూడసాగాను.

ఆవిడ శాంతస్వరాన మెల్లిగా యిలా అన్నారు.

"ఆయనకి పత్రికతోపాటు అందులో యిన్నాళ్ళనాకా నమ్ముకుని పని చేస్తున్న వాళ్ళ శ్రేయస్సు అంతకంటే ముఖ్యం!

మవ్వు ఎలాటి యిబ్బందులు వచ్చినా సహించి, అన్ని కష్ట నష్టాలకి ఎదురొడ్డి దీన్ని నడపగలననే హామీ నాకిస్తే, అలాటి ధైర్యం నీకుంటే పత్రికని అమ్మను- లాభాల సంగతి పెద్దగా ఆశించకపోయినా కనీసం మీ అందరికీ ఎలాటి లోటూ రాకుండా జరగాలి!"

నా నోట్లోంచి ఆహినంత ఉధృతమైన ప్రవాహంలా వురకబోతున్న వాగ్దానాలన్ని ఎలాగో నిగ్రహించుకున్నాను

మెల్లగ, గంభీరంగా, దృఢంగా అన్నాను.

"మీరు నా మీద విశ్వాసం వుంచి అప్ప గించిన బాధ్యతని నా కంఠంలో వూపిరి వుండగా విస్మరించను. సుదర్శనంగారు ఏ వాక్క విషయంలో నా మీద ఎలాటి వాత్సల్యాభిమానాలు దినదినం పెంచుకు న్నారో మీకు తెలియని విషయం కాదు. మీరే వాగ్దానం చేయమంటే అది చేస్తాను. కావాలంటే నేను-వర్కర్స్ అంతా కలిపి కాగితం వ్రాసి యిస్తాం"

"వద్దు రవీ! నిజాయితీ గలవాడికి మాటకి మించిన సాక్ష్యం యింకేమీ అవ సరం లేదు, కాంతికి యీ రోజునే పత్రిక అమ్మే విషయంలో నా అభిప్రాయం మార్చుకున్నానని కబురు చేస్తాను. యిక దీని మీద సర్వాధికారాలు నీవి! పైన పేరుకి మాత్రమే యజమాన్యం నాది.

నా సంతోషం చెప్పనలవికానిది, కాంతికి యీ పత్రిక దక్కకూడదు అని నా లోలోపల నేను మనస్పూర్తిగా నేను కోరుకుంటున్న కోరిక నెరవేరింది.

సుభద్రమ్మగారు పత్రిక అమ్మ చూపడం లేదనీ మనకోసం కేవలం తన బిడ్డలుగా భావించుకుంటున్న మనకోసం, ఆవిడ యీ బాదర బందీ భరించటానికి సిద్ధపడ్డారని. ఎక్కువగా వచ్చిన లాభాన్ని తిరస్కరిం చారని కూడా వర్కర్స్‌కి చెప్పాను. వాళ్ళ కళ్ళు కృతజ్ఞత తచెమర్చినాయి! వారు పడిన ఆనందంతో అంత యింత కాదు,

భాస్కరంతో నేను అనుకున్నట్టు పేచీ రానేవచ్చింది. భాస్కరం పత్రికకు తనే ఎడిటర్‌గా వుంటానని పట్టుపట్టాడు. చివ రకి పత్రికతో అతనికేమి సంబంధం లేనట్టు నెలనెలా అతనికి వేయి రూపాయలు యిచ్చేట్టు ఒప్పందం జరిగింది!

'మొత్తానికి నువ్వు చాలా ఘటికు డివి! మెత్తగా, అణకువగా కన్పిస్తూనే నీ అభిప్రాయా లన్నిటిని అమలుపరుచుకుం టున్నావు!" అన్నాడు భాస్కరం వ్యంగ్యంగా.

అతనితో వాదన యిష్టంలేక నేను బల వంతంగా ఆ వ్యంగ్యం విని వూరు కున్నాను.

ఈ పత్రిక విషయంలో సుభద్రమ్మ

గారు అన్నట్టుగానే నాకు సర్వాధికారాలు యిచ్చారు,

అందులో నేను మొట్టమొదట నిర్వ ర్తించవలసిన బాధ్యత కొంత మొత్తం జమ చేసి శాంతి అప్పు తీర్చేయాలని చూడటం!

సుభద్రమ్మగారికి చెప్పాను యీ విషయం,

"యిప్పుడేం తొందర? శాంత డబ్బు కోసం వత్తిడి తేవటంలేదుగా?" అన్నా

"లేదమ్మా! యిది తీరిపోతే హాయిగా ఉంటుంది" అన్నాడు.

"సరే! నీ యిష్టం! ఆ కష్టసుఖాలన్నీ నావని చెప్పాగా!" అంటూ అనుమతి యిచ్చారావిడ.

డబ్బు తీసుకువెళ్ళాను. శాంత డబ్బు గలవాడిని పెళ్ళాడిందని విన్నాను, కానీ యింత ఐశ్వర్యంతో తులతూగుతుందని నాకు తెలియదు. నేనెంత ప్రయాసపడి తెచ్చిన యీ డబ్బు శాంతకి తృణప్రాయ మని తెలుస్తూనే ఉంది.

ఆ యింట్లో అడుగు పెట్టగానే మొట్ట మొదట చూసిన వ్యక్తి గోపాలం!

నన్ను చూడగానే ఆశ్చర్యపోయాడు సంభ్రమంగా దగ్గరగా వచ్చాడు.

"రవీ! నువ్వా! ఏమిటి విశేషం?"

"ఈ యజమానురాలితో పనుండి వచ్చాను."

గోపాలం నవ్వాడు.

లోపలికి వెళ్ళి చెప్పాడు.

శాంతి బైటకి వచ్చింది. నన్ను విలా సంగా చూస్తూ వయ్యారంగా నడుస్తూవచ్చి నా కెదురుగా వున్న సోఫాలో కూర్చుంది.

"వూరకే రారు మహాత్ములు" అంది కనుబొమలెత్తి శాంతి

నేను వెంటతెచ్చిన డబ్బు తీసి బైట పెట్టాను.

"ఏమిటది?"

"మీ కివాల్సిన డబ్బు!"

"ఎవరడిగారు?" కనుబొమలు చిట్లిం చింది.

"మీరు అడిగేవరకూ ఆగటం మర్యాద కాదు, అవసరానికి తీసుకున్నాం. చేతికంద గానే యిస్తున్నాం. సుభద్రమ్మగారు మీకు కృతజ్ఞతలు చెప్పమన్నారు."

శాంతి నా వైపు ఆలోచనగా చూసింది.

"ఆ నోటులో ఏముందో తెలుసా?"

"తెలుసు. అడిగిన వెంటనే యిచ్చే యాలని"

"మరి? చదువురానివాడిలా మాట్లాడ్తా వేం! అంటే దాని అర్థం నేను అడిగి నప్పుడు మాత్రమే యియ్యాలని తెలియదు?"

నేను నిర్విణ్ణుడనయ్యాను. ఈ విప తీతార్థం ఎక్కడా వుండదేమో!

"వెళ్ళు! యిప్పుడిస్తే నాకు ఇన్కం టాక్సు బెడదవుంది. సమయం చూసి చెబు తాను. నేను సుభద్రమ్మగారికి చెబుతా,

నేను క్షణంసేపు ఆలోచించాను. ఇక నేను చెప్పాల్సిందేమీ కనిపించలేదు. డబ్బు బాగ్‌లో పెట్టి మూసివేశాను.

"కూర్చో. కాఫీ త్రాగి వెళ్దువుగాని"

"పనుంది. వెళ్లాలి"

"మా యింట్లో కాఫీలో విషం కల పంలే!"

"నేను కాఫీ తక్కువగా తాగుతాన తెలుసు నీకు!"

దూరంగా టేబిల్‌దగ్గర నిలబడి కాగి తా లేవో చూస్తున్న గోపాలం మా ఇద్దరి వైపు కుతూహలంగా చూస్తున్నాడు

శాంత కాఫీ తాగమని బలవంతం చేస్తూన్నా వినిపించుకోకుండా వచ్చేసాను నేను.

శాంతి యీ డబ్బు తీసుకోలేదు అంటే యీ రీతిగా నా జుట్టు తన చేతుల్లో ఇరి కించుకోవాలని చూస్తోంది ఒక ప్రక్క భాస్కరం యింకోపక్క శాంతి. నా పని ఎప్పటికైనా అడకత్తెర పోకచెక్కలా అవ్వకమానదని నా అంతర్యం హెచ్చ రించసాగింది.

(సశేషం)

---

'జ్యోతి' మార్చి సంచిక

మార్చి 5 వ తారీఖునాటికే

మీకు అందగలదు.

మేనేజింగ్ ఎడిటర్



# జ్యోతి చిన్న కథల పోటీ

నిర్మల విద్యావతి పెద్దల యిష్టాను సారమే చదువుకొన్న భర్తను పొందగలిగింది అత్త వారిల్లు పురాతనా చారాలతో మునిగి తేలుతూంది వారితో ఏకీభవించలేనినిర్మలను ఆ యింట్లో మడిగట్టుకొన్న అత్త మరదలు మొదలు వీధి బడికి వెళ్ళే మరిది వరకు హీనంగా చూస్తున్నారు చదువుకున్న ఆమె భర్త కూడా తల్లివైపే! నిర్మల మానసిక వేదన వివరించ నిది

ఈ పరిస్థితిలో నిర్మల తనకు యిష్టం లేని ఆచారాలకు తల వంచకపోగా— గంపగయ్యాళిగా తయారై అందర్నీ లొంగదీసుకుంటుందా? లేక వారు పెట్టే బాధలు అనుభవిస్తూ మంచి తనంలో వారిని తన మార్గంలోకి త్రిప్పుకో గలుగుతుందా?

1 కథ కాగితానికి ఒక ప్రక్కే రాయాలి

2 అరఠావు సైజులో 4 పేజీలకు మించరాదు

3 పోటీకి వచ్చిన కథలు ఎట్టి పరిస్థితుల్లోనూ త్రిప్పి పంపబడవు

4 మేమిచ్చిన ఇతివృత్తాన్నే కథగా రాయాలి

5 మార్చి 15 1971 తర్వాత వచ్చిన కథలు పరిశీలించము

6 కథలను చిన్న కథలపోటీ అని Superse ibe చేసిన కవర్లో

JYOTI 63/1 South west bcag Road T Nagar Madras 17
అన్న చిరునామకు పంపాలి

—మేనేజింగ్ ఎడిటర్






అభినవ ప్రహ్లాదుని సందేశం

ధనమే దైవమనీ, హిరణ్యుడే దైవమనీ అనవలసినదిగా అనాది హిరణ్యకశిపుడు కొడుకు ప్రహ్లాదుని శాసించాడు కాని సామ్యవాదయే దైవమని, దరిద్రనారాయణుడే దైవమనీ—ధనమెప్పుడు దైవం కాదని బదులిచ్చాడు ఈ నాటి ప్రహ్లాదుడు!

తన కొడుకు—తన శత్రువునేపొగడి తన మాటలను తెగడుతున్నందుకు హిరణ్యకశిపుడు మహోగ్రుడయాడు. విషనాగులచే కరిపించాడు' మదపుటేనుగులచే త్రొక్కించాడు—ఎత్తయిన కొండలపై నుంచి త్రోయించాడు. అయినా—ప్రహ్లాదుడు. సామ్యవాద సంస్మరణ వీడలేదు!

అగ్గిమీద గుగ్గిలం లా ఆగ్రహంతో పొగలు గ్రక్కాడు తండ్రి ప్రహ్లాదుని పిలిపించి—

"ఎక్కడున్నడురా నీ దైవం?" పసివానిని గద్దించాడు.

"అంతటా వున్నాడు" అదరు బెదురు లేని సమాధానం వచ్చింది,

"ఈ టెలిఫోన్‌లో వున్నాడా"

"ఆఁ వున్నాడు?

పసివాని ఈ నిర్భాతి సమాధానం హిరణ్యకసిపుని నేత్రాలు మరింత ఎర్రబారాయి.

అటున్న టైప్‌రైటర్‌ను చూపి "అటైపు రైటర్‌లో వున్నాడా?"

"ఓ లేకేం వున్నాడు."

ఆవేశంగా ఇటు తిరిగి "ఈ ట్రాన్సిస్టరులో" ఉన్నాడా నీ దేవుడు? దిక్కులు దద్దరిల్లేలా పిడుగపడినట్లు ప్రశ్నించాడు.

"ఓ ఉన్నాడు."

పిల్లవాని సమాధానం చిచ్చరపిడుగులా పనిచేసింది

అసామ్యవాద ద్వేషికి ఆవేశంతోవూగిపోతున్నాడు. భూమ్మీద అన్చిన గదను భుజంపై వేసి.

"ఈ స్థంభంలో వున్నాడా? లేడిపిల్లపై లంఘించిన సింహంలా గర్జించాడు.

"వున్నాడు"—టక్‌న జవాబిచ్చాడు ప్రహ్లాదుడు.

కల్లకపటాలు లేని పల్లెటూరి వలపులు
అల్లకల్లోలమైన పట్నవాసపు తలపులు

అశోక్ మూవీస్

# పవిత్రబంధం





విశ్వభారతి పిక్చర్స్ ప్రొడక్షన్ నెం. 1 లో
జమున, నాగేశ్వరరావు

"ఏయ్ అని గర్జిస్తూ—గదతో, స్థంభాన్ని కొట్టాడు,

స్థంభం నిలువునా బ్రద్దలైంది. వేళ వేళా రాశముల మధ్య—సామ్యవాది, శాంతి దూత పండిత నెహ్రూ ఆవిర్భవించాడు సామ్యవాదమనే గులాబీ బాణాన్ని ధనమే దైవమనే హిరణ్యకశిపునిపై సంధించాడు, తృటిలో హిరణ్యకశిపుడు నేల గూలాడు. సామ్యవాదం అజేయమైంది.

సంభ్రమాశ్చర్యాలు గొల్పే ఈ రసవత్తర వ్యంగ్యాత్మక సన్నివేశం—శ్రీసరస్వతీ చిత్రవారి విప్లవాత్మక చిత్రం కథానాయకురాలులో" శ్రీ శ్రీ రచించిన "అభినవ ప్రహ్లాద" గేయ నాటికకు అద్భుత రూపకల్పన. హిరణ్యకశిపునిగా అభినేత్రి వాణిశ్రీ ప్రహ్లాదునిగా బేబి మున్ని శ్లాఘనీయంగా నటించారు.

జనవరి 23 న సెన్సారయిన యీ చిత్రం త్వరలో విశాలాంధ్ర అంతటా విడుదలకై తుది మెరుగులు దిద్దుకుంటోంది,

పటుత్వైన కథా గమనం, ప్రేక్షకులను విస్మయపరచే సస్పెన్సు గల యీ చిత్రాన్ని దర్శకులు గిడుతూరి సూర్యంనవరసాలను చక్కగా మేళవించి అన్ని

దారి భాగ్యనగర్ సెట్‌లో 22-1-71 తేదీన ఉదయం 9 గంటల సమయంలో సురేష్ మూవీస్ వారి "ప్రేమనగర్" చిత్రానికి షూటింగులు ప్రారంభమయ్యాయి.

సురేష్ మూవీస్ పతాక నిర్మాత శ్రీ డి. రామానాయుడుగారి సుపుత్రుడు చి. సురేష్‌బాబు కెమెరా స్విచ్ ఆన్ చేశాడు. ప్రముఖ నిర్మాత శ్రీ బి. నాగిరెడ్డి క్లాప్ కొట్టారు. అందాలు విరజిమ్ముతోన్న ఆ అందమైన గొప్ప భవనంలో జమిందార్ అబ్బాయిగా పాల్గొన్న అందాల నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావుపై తొలిషాట్ ప్రారంభమయింది.

షెడ్యూలు ప్రకారంగా మార్చి మాసంలో పూర్తి కానున్న యీచిత్రంలో అక్కినేని నాగేశ్వరరావు, వాణిశ్రీ, యస్. వరలక్ష్మి, శాంతకుమారి, రమాప్రభ, హేమలత, ప్రఖ్యాత హిందీ నాట్యతార లక్ష్మీఛాయ, గుమ్మడి సత్యనారాయణ, రాజబాబు, కె. వి. చలం, ధూళిపాళ, పెరుమాళ్లు మున్నగు నటీనటులందరూ నటిస్తున్నారు. కథ కోడూరి కౌసల్యాదేవి, రచన ఆచార్య ఆత్రేయ, సంగీతం కె. వి. మహాదేవన్.

నవయుగ వారు విడుదల చేయనున్న ఈ చిత్రానికి దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు నిర్మాత: డి రామానాయుడు

పూర్ణా ఆర్ట్సు పిక్చర్సు వారి
"కూతురే కోడలు"

షూటింగ్ ప్రారంభమయి ఇప్పటికి ఐదు రీళ్ళకు పైగా చిత్రం పూర్తయింది.



సంజీవిని ఫిలిమ్స్
'ప్రేమజీవులు'లో సంధ్యారాణి

"వేషం వేషం రయ్యో" అంటూ సమాజంలో మోసగాళ్ళను ఎత్తి చూపుతూ విజయలలిత పాడిన పాట, అన్న కన్పించిన తర్వాత అంతులేని ఉత్సాహంతో "అమ్మపైనా, నాన్నపైనా, అన్నపైనా అన్నీ నీవయ్యా" అంటూ గీతాంజలి పాడిన పాట చిత్రీకరణయింది.

ఫిబ్రవరి పదహారు నుండి ఇరవై ఆరు వరకు హైద్రాబాద్‌లో 3 పాటలు చిత్రీకరించబోతున్నారు అన్నాచెల్లెళ్ళ అనురాగం పునాదిగా గల్గి, కన్నకూతురే పెంచిన కొడుకును పెళ్ళి చేసుకొని త

తరగతుల ప్రజలను అలరించేలా ప్రతిభావంగా చిత్రిస్తున్నారు.

వాణిశ్రీ, శోభన్‌బాబు నాయకీ నాయకులుగా నటిస్తున్న ఈ చిత్రంలో— నాగభూషణం ఎంతో వైవిధ్యంగల భూమికను పోషిస్తున్నారు. అల్లు రామలింగయ్య రాజబాబు బోలెడు నవ్వుల్ని వర్షంలా కురిపించనున్నారు. ఛాయాదేవి, విజయశ్రీ, నూతననటివరలక్ష్మి మంచి వినోదాన్ని ఇవ్వనున్నారు. బాల తారలు—బేబీ బ్రహ్మాజీ బేబీ గౌరి, బేబి మున్నీ మురిపిస్తారు.

ఇంకా రావు గోపాలరావు, పి హెచ్. కృష్ణమూర్తి, కాకరాల, మోదుకూరి సత్యం వరంగల్ పహిల్‌మాన్ జోసెప్, జూ. భానుమతి. నవీనలక్ష్మి మొదలగు వారు నటిస్తున్నారు.

సంగీతం ఏ. టి. రాజ్.

నిర్మాతలు గిడుతూరి సూర్యం— నల్ల వెంకట్రావ్

కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం గిడుతూరి సూర్యం.

విడుదల పూర్ణా.

రంగులలో

రమణీయంగా రూపొందుతోంది!

"ప్రేమ నగర్"

వాహినీ స్టూడియోలో 8 వ ఫ్లోర్‌లో శోభాయమానంగా రూపొందించిన జమీం

యుగంధరా ఆర్ట్ వారి 'జగత్ మొనగాళ్ళు' లో జూ॥ కాంచన





శ్రీ లక్ష్మీకళాచిత్రవారి 'రైతుబిడ్డ'లో
ఎన్. టి. రామారావు, వాణిశ్రీ

ఇంటికి కోడలుగా వచ్చే విచిత్ర కథతో కూడిన చిత్రం.

శోభన్‌బాబు, రామ్మోహన్, ప్రభాకర రెడ్డి, రావికొండలరావు, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, విజయలలిత. గీతాంజలి, హేమలత, ఝాన్సీ, విజయశ్రీ సంధ్యారాణి, మాస్టర్ ఆదినారాయణ, బేబీ బ్రహ్మాజీ, బేబీ గౌరి నటీనటులు. సంగీతం కె. వి. మహాదేవన్. డైరెక్టర్ పి. లక్ష్మీదీపక్. నిర్మాతలు అట్లూరి పూర్ణచంద్రరావు, యం. చంద్రశేఖర్. శ్రీ ఫిల్మ్స్ విడుదల.

'పట్టుకుంటే లక్ష'

హరికృష్ణా ఫిల్మ్స్ బేనర్ మీద బి. హరి నారాయణ దర్శకత్వంతో నిర్మింపబడుతున్న క్రైమ్ సస్పెన్స్ థ్రిల్లర్ చిత్రానికి, పట్టుకుంటే లక్ష' అనే పేరు నిర్ణయించారు. ఈ చిత్రంలో కృష్ణ, సత్యనారాయణ, నాగభూషణ, రాజ్‌బాబు,

ధూళిపాళ, కె.వి. నాగేశ్వరరావు, పి. హెచ్ కృష్ణమూర్తి, కె. వి. చలం, మిస్టర్ మద్రాస్, సంపత్, రాజా, విజయలలిత, ఉదయచంద్రిక, సలీమా, కల్పన, రత్నం మొ॥ నటీనటులతోబాటు, హలం శకుంతల అనే నూతన నర్తకీమణులు ఈ చిత్రంలో పరిచయం కాబడ్డారు.

కూర్పు, దర్శకత్వం: బి భావ నారాయణ, రచన: కొమ్మూరి సాంబశివ రావు, సంగీతం: ఘంటసాల.

ఆంధ్రప్రదేశ్ సోల్ డిస్ట్రిబ్యూటర్: అసీర్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజస్, నవయుగ విడుదల.

నిర్మాతలు: బి. వి. కృష్ణమూర్తి బి.ఏ, వి. కృష్ణరాజు బి. ఏ.

### జగత్ మొనగాళ్ళు

యుగంధర్ ఆర్ట్స్ సమర్పించు 'జగత్ మొనగాళ్ళు' దేశభక్తి, క్రైం, చక్కని సెంటిమెంట్ మేళవింపబడిన చక్కని కథావస్తువు. కథ: ఎ.ఎల్.ఎ. నాయుడు, మాటలు: అసిశెట్టి, పాటలు: శ్రీ శ్రీ. సంగీతం: సత్యం, ఎడిటింగ్: హరి నారాయణ, నిర్మాత: వై. సుశీల్‌చౌదరి, సహనిర్మాత: కె. సుబ్బారావు, దర్శకత్వం: ఎమ్. ఎస్. గోపీనాథ్.

### ఎన్నికల్లో నాగభూషణం

పసిపిల్లలకు పాల డబ్బా లేదు. ఇంట్లో బియ్యం లేవు. ఆవీ లేవు, ఇవీ లేవు -అన్నీ నిండుకున్నాయి -అంటూ రెడ్డి భార్య

### 'ప్రేమ నగర్' ప్రారంభోత్సవ సమయంలో





రేఖా అండ్ మురళీవారి 'మిడుతంబొట్లు' లో
భరణీకుమార్, పద్మనాభం, లత

గంపగయ్యాలి రాధాకుమారి సాధిస్తుంటే సంతానభాగ్యుడైన నిర్భాగ్యుడు-నిరుద్యోగి భూషణం భార్యను ఒక్కసారి కళ్ళల్లోకి చూశాడు ఒక్క చిరునవ్వు నవ్వాడు.

కాంతం ...మన ఒక్క కుటుంబమే కాదు. మనలాటి నూటికి తొంభై కుటుంబాల దుస్థితి యిది.. .కాంతం! మనకు ధనం లేకున్నా జనం వున్నారు. మన వెనుక ఎనభై తొమ్మిది కుటుంబాలున్నాయి మనదే మెజారిటీ కాకూడదని పెద్దవాళ్ళ ప్రయత్నం. అవుతుందేమోనని మన ఆశ. ఆ ఆశతోనే ఎలెక్షన్స్ జరుపుతున్నాం. పాతవాళ్ళు కొత్త బురఖాల్లో. కొత్త వాళ్ళు పాత ముసుగుల్లో గెలుస్తారు. పదవులకు వస్తారు చూద్దాం. కొత్త వాళ్ళు పాతవాళ్ళవుతారో? పాతవాళ్లు కొత్తదారి తొక్కుతారో చూద్దాం. మన దేశం బాగుపడే రాత వుందో లేదో చూద్దాం."

దీర్ఘోపన్యాసాన్ని ముగించి సగర్వంగా స్టేజదిగిన రాజకీయవేత్తలా-భూషణం గబగబా గదిలోకి వెళ్ళాడు. భార్యా పిల్లలూ

నిర్ఘాంత పోయి అలానే నిల్చుండి పోయాడు,

ఈ రసవత్తర దృశ్యం - భానూ మూవీస్ వారి సంచలన చిత్రం "మాతృ ప్రేమ" లోనిది. భూషణంగా-వైవిధ్యం గల కొత్త తరహా పాత్రను నాగభూషణం ప్రతిభావంతంగా నటిస్తున్నారు. జనవరి 22 నుంచి 25 వరకు కర్పగం స్టూడియోలో జరిగిన రెండవ షెడ్యూలు షూటింగ్‌తో దాదాపు సగం చిత్రం నిర్మాణ మయింది.

శోభన్‌బాబు, చంద్రకళ, నాగభూషణం, పి. హెచ్. నారాయణరావు, సంధ్యారాణి, రాధాకుమారి, మాస్టర్ విశ్వేశ్వరరావు. పొతకమూరి నాగభూషణం మొదలగు వారిపై మరికొన్ని రసవత్తర సన్ని వేశాలను ఈ షెడ్యూలులో సెల్యూలాయిడ్‌పై మలిచారు.

ప్రముఖ నటి సావిత్రి - మాతృమూర్తిగా ప్రధాన భూమికను పోషిస్తున్న ఈ చిత్రం మూడవ షెడ్యూలు షూటింగ్ ఫిబ్రవరి 8 నుండి జరుగుతుంది. రెండు పాటల రికార్డింగ్‌కు నిర్మాతలు సన్నాహాలు గావిస్తున్నారు.

పతకమూరి సుబ్బారాయుడు సమర్పిస్తున్న ఈ చిత్రానికి కధను ముద్దిపల్లి సూరి రచించారు. ట్రీట్‌మెంట్ ఎన్. జగన్నాధ్ యిస్తున్నారు. పసన్నైన సంభాషణలు, పసందైన పాటలు ఆత్రేయ వ్రాస్తున్నారు. కమనీయమైన శరాగాలను కె. వి. మహాదేవన్ కూర్చుతుండగా. నేత్రపర్వతమైన ఫోటోగ్రఫీని ఎం. కె. రాజ్, ముపీస్ అహమ్మద్ కూర్చుతున్నారు.

ప్రొడక్షన్ మేనేజర్ కె. చలపతిరావు నిర్మాణ నిర్వహణ పొతకమూరి నాగభూషణం. సహకార దర్శకులు జి. రామమోహన్‌రావు నిర్మాతలు: డి. వివేకానందరెడ్డి, రుద్రరాజు సీతారామరాజు. దర్శకులు డి. మాధవరావు.

### శ్రీమంతుని కనువిప్పు

మదిర. మదవతుల నిషాలో మజాగా వున్న శ్రీమంతుడు రాజా—ఒకమ్మాయి తగు గుణపాఠం చెప్పడంతో తన్నుతాను తెలుసుకున్నాడు. ఆప్తులెవరో, అతని శత్రువులెవరో గ్రహించాడు. పరితప్త హృదయుడై—చక్కని వెన్నెల వేళ - చిక్కని చెట్లమధ్య ఆ అమ్మాయిని కలుసుకున్నాడు. ఆ అమ్మాయి ఆనందం ఇంతా అంతా గాదు. ఆ ఆనందంలో—

"మధుపతల ఉయ్యాలలో
మనసులు ఊగాలనీ
మల్లెల పందిరిలో
మనువులు కలవాలనీ
కోటి దేవుళ్ళనే
కొంగుసాచి అడిగేను



శ్రీ అన్నపూర్ణ ఆర్టు పిక్చర్స్‌వారి 'పవిత్ర జీవితం' లో
వెంకటేశ్వరరావు, నాగేశ్వరరావు

చల్లని వెన్నెలలో నా ఒడిలో
నిదురపో
అల్లరి మానుకొని నా మదిలో
ఒరిగిపో''

అంటూ—రాజాను ప్రేమసాగరంలో ఉల లాడించింది.

మధురమైన ఈ రసవత్తర సన్నివేశం విశ్వభారతి ప్రొడక్షన్స్ వారి తొలి చిత్రంలోనిది. మహాబలిపురం సమీపంలోని కోవిలం బీచ్ ప్రాంతంలో నాగేశ్వరరావు, జమునపై యీ దృశ్యాన్ని రమ్యంగా చిత్రీకరించారు.

జనవరి రెండవ వారంలో జరిగిన అవుట్‌డోర్ షూటింగ్‌లో పిల్లల బొమ్మల పెళ్ళి సన్నివేశాన్ని బేబీ శ్రీదేవి, మాష్టర్ ఆదినారాయణ, మరి కొందరు బాలలపైన దృశ్యీకరించారు. మరికొన్ని రసవత్తర ఘట్టాలను సెల్యులాయిడ్‌పై మలిచారు.

గుమ్మడి, సూర్యకాంతం, రమణారెడ్డి, రాజబాబు, జయకుమారి, రావికొండలరావు, ఝాన్సీ, సాక్షి రంగారావు ప్రధానపాత్రలు పోషిస్తున్న ఈ చిత్ర నిర్మాణం మూడు వంతులు అయింది,

ప్రత్యగాత్మ దర్శకత్వం వహిస్తున్న యీ చిత్రానికి కథ, సంభాషణలు: ముళ్ళపూడి వెంకటరమణ రచించారు. సంగీతం టి. చలపతిరావు కూర్చారు.

శ్రీ జి. రాధాకృష్ణమూర్తి నిర్మిస్తున్న నవయుగవారు విడుదల చేస్తున్నారు.

ఉప్పుతో చేసిన బొమ్మను సముద్రంలో దించి లోతు ఎంత వుందో కనుక్కోడానికి ప్రయత్నం చేశారట వెంటనే కరగి పోయింది.

అలాగే బ్రహ్మజ్ఞానిని ఆత్మ తత్వం. చెప్పమంటే ఏం చెప్పగలడు?

—కీ॥ శే॥ వి. వి. రాఘవయ్య